



















నోరూరించే మనసుదోచే మైమరపించే

పార్లే పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పళ్ళ స్వాదులు-రాస్ప్‌బెరి,
అనాస, నిమ్మ, నారింజ,
మోసంబి.
13 బిళ్ళలు ప్రతి పాకెట్ లో





# బహుమతిపొందినవారు

మొదటి బహుమానము : శ్రీ. ఉమేష్ గుప్త, 6బి/6, ఉత్తిమార్గ్, ఓల్డ్ రాజిందర్ నగర్, న్యూ ఢిల్లీ 110 060

బహుమతిపొందిన వాక్యము :

**"I like Chiclets best because I make friends by just offering 'Chiclets' to others."**

రెండవ బహుమానములు :

(1) శ్రీ. వి. నందకుమార్, 1-10-360, బిగంపేట, హైదరాబాద్ 500 016.
(2) శ్రీ. సునిల్‌కుమార్ సెహల్, 48, టాగూర్ విల్లా, కన్నాట్ ప్లేస్, డెహ్రా-డున్.
(3) శ్రీ. అరుణ్ చోప్రా, ఆర్ 696, న్యూ రాజిందర్ నగర్, న్యూ ఢిల్లీ 110 060.
(4) శ్రీ. ఆర్. క్రిష్ణన్, ఎ 88, 12వ. ఎవెన్యూ, అశోక్ నగర్, మద్రాసు 600 083.

3వ. బహుమానములు పొందిన యిరువది మందికి పోస్ట్‌ద్వారా తెలుపబడుతుంది.

# అభినందనలు

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!



## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది. ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది. పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారలతో తయారైన బోర్న్‌విటా రుచికరమైనది.




శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం **క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

OBM 0449 TEL


nutrine
nutrine
nutrine
nutrine






nutrine



# చందమామ


సంస్థాపకుడు : నాగిరెడ్డి

సంచాలకుడు : 'చక్రపాణి'


ఈ నెల. బేతాళకథ [''మారిన మనసు''] బూర్లె నాగేశ్వరరావు రచన.

అందం అందరినీ ఆకర్షిస్తుంది. కాని సంస్కారాలు వేరైనప్పుడు ఆకర్షణ నిలవదు. అయితే మానవత సంస్కారాలలో తేడాను కూడా జయిస్తుంది. ఈ అంశం ''మారినమనసు'' అన్న కథలో స్పష్టమవుతుంది.

జీవితం పురోగమించే కొద్దీ పరిపాలన క్లిష్టమవుతుంది. పరిపాలనకు దక్షత కావాలి. ''రాజప్రతినిధి గుర్రాలు'' ఈ సంగతి వివరిస్తుంది.


సంపుటి 54 ఏప్రిల్ '74 సంచిక 4


CP



CHITRA




అజన్మ నశ్శాత్య మశిక్షితో యః
తస్యా ప్రమాణం వచనం జనస్య:
పరాతి సంధాన మధీయతే యైః
విద్యేతి తే సంతు కిలాప్తవాచః. 1

[పుట్టినప్పటి నుంచీ మోసం తెలియని వాడి మాట మనుష్యులకు నమ్మ బుద్ధి పుట్టదు. కాని ఇతరులను మోసగించే విద్యలో అరితేరిన వాళ్ళు అప్తవాక్కులు!]

అర్థాతురాణాం న గురుర్న బంధుః,
కామాతురాణాం న భయం న లజ్జా,
విద్యాతురాణాం న సుఖం న నిద్రా,
క్షుధాతురాణాం న రుచిర్న వేలా. 2

[ధనదాహం గలవారికి పెద్దలనీ, బంధువులనీ ఉండదు. కామజ్వరం గలవాడికి భయమూ, సిగ్గూ ఉండవు. విద్యాసక్తి గలవాడికి సుఖమూ, నిద్రా ఉండదు. ఆకలితో అలమటించే వాడికి రుచీ, వేళా తెలియదు.]

యత్రాస్తి లక్ష్మీ ర్వినయో న తత్ర,
అభ్యాగతో యత్ర న తత్ర లక్ష్మీః,
ఉభౌచ తౌ యత్ర న తత్ర విద్యా:
నైకత్ర సర్వో గుణసంనిపాతః. 3

[ఐశ్వర్యం ఉండే చోట వినయం ఉండదు. అతిథులు విస్తారంగా వచ్చే చోట ఐశ్వర్యం ఉండదు. ఆ రెండూ ఉండే చోట విద్య ఉండదు. ఏ ఒక చోటా అన్ని మంచి గుణాలూ కలవవు.]

లోకం తీరు



# యక్షపర్వతం

## 23

[ఖడ్గ జీవదత్తులు యుక్తిగా వీరపుర సైనికుల్ని బిలదుర్గంలో చుట్టుముట్టి వాళ్ళు లొంగిపోయేలా చేశారు. సమరబాహుతో పాటు వాళ్ళు కొండకోట దగ్గిరకు వచ్చేసరికి, అక్కడ వీరపుర మంత్రి కనిపించాడు. అతడు సమరబాహును తన రాజు తరఫున కొండకోటకు రాజుగా అంగీకరించి, ఖడ్గ జీవదత్తులతో నది దగ్గిరకు పోయాడు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులూ, వీరపుర మంత్రీ నది ఒడ్డుకు చేరే సరికి, రథాకారంలో వున్న పడవ నీటి మీద తేలియాడుతూ వారున్న చోటుకు రాసాగింది. ఖడ్గ జీవదత్తులు పడవ కేసి పరీక్షగా చూసి, అది రథాకృతిలో తయారు చేసిన కొయ్య పడవ అని గ్రహించారు.

జీవదత్తుడు, వీరపుర మంత్రి కేసి తల తిప్పి, ''మహామంత్రీ! ఒక యక్షుడి వల్ల మా గురించిన సమాచారం తెలిసిందన్నారు. ఆ యక్షుణ్ణి మీరీ పడవలోనే కలుసుకున్నారా?'' అని అడిగాడు.

వీరపుర మంత్రి ఒక క్షణకాలం ఏమి చెప్పటమా అని ఆలోచిస్తున్న వాడిలా తటాపటాయించి, "క్షత్రియయోధుల్లారా, దాపరికం లేకుండా మీకు జరిగిన సంగతి చెప్పేస్తాను. గడచిన రాత్రి రెండవజాము వేళలో ఒక యక్షుడు ఆకాశమార్గాన



పురం అనే ఒక ప్రదేశంలో అబద్ధం ఆడాడు. అమెనూ, మీ రాజకుమార్తె వసంతకుమారిని అపహరించుకుపోయి నట్టె అపహరించుకు పోయాడన్న మాట!'' అన్నాడు.

వీరపుర మంత్రి అంతకంతకూ ఒడ్డుకు సమీపిస్తున్న పడవ కేసి ఓమారు చూసి, ''జీవదత్తా, ఆ పద్మావతి లాగే మా రాజు గారికీ వసంత ఒక్కగా నొక్క కుమార్తె. యక్షుడు వదిలిపోయిన తాళపత్రంలో రాసివున్న దానిని బట్టి మీరు వింధ్య పర్వతాల్లో ఎక్కడో వున్న రాతిరథాన్నొక దాన్ని కదిలించ గలమని ప్రతిజ్ఞ చేశారట! అవునా?'' అన్నాడు.

ఖడ్గవర్మ కత్తిదూసి ఒడ్డు కేసి వస్తున్న పడవను చూస్తున్న వాడల్లా చప్పున తల తిప్పి, "మహామంత్రీ, మీ ప్రశ్నకు ఒక్కటే జవాబు. మీరనే ఆ రాతిరథాన్ని కదిలించటం కాదు, దాన్ని తునాతునియలు చేసి, ఆ క్రూరుడైన యక్షుణ్ణి మా ఆయుధాలకు ఎరచేస్తాం. వాడికి బందీలుగా చిక్కిన పద్మావతీ, వసంతలను విడిపించుకు రాకపోతే మేం క్షత్రియులమే కాదు,'' అన్నాడు.

హఠాత్తుగా జీవదత్తుడికి పడవను గురించిన అనుమానం ఒకటి వచ్చింది. ఈ పడవ యిక్కడ నదిలో వున్నదని

రథంలో వచ్చి, భవనం మీద చెలికత్తెలతో కబుర్లాడు తున్న వీరపురరాజు పుత్రిక వసంతకుమారిని బలాత్కారంగా అపహరించుకు పోయాడు. అతడు భవనం మీద వదిలిపోయిన ఒక తాళపత్రంలో రాసివున్న దానిని బట్టి, వాడు లోగడ పద్మసేన మహారాజు కుమార్తె అయిన పద్మావతిని కూడా యీ విధంగానే అపహరించుకు పోయినట్టు తెలిసింది,'' అన్నాడు.

మంత్రి మాటలు వింటూనే జీవదత్తుడు కోపంతో ఊగిపోతూ, ''ఆ దుర్మార్గుడైన యక్షుడు పద్మావతిని వివాహమాడి తీసుకుపోతున్నట్టు మాతో అరణ్య

వీరపుర మంత్రికి ఎలా తెలిసింది? పడవలో వున్నవాడు రాజకుమార్తెలను అపహరించుకు పోయిన యక్షుడే అయి వుంటాడా? లేక యిందులో వీరపురరాజు తమను తేలిగ్గా బంధించే ఎత్తు ఏమైనా వున్నదా?

జీవదత్తుడు యిలా ఆలోచించి, వీర పుర మంత్రితో, "మహామంత్రీ, నా దొక అనుమానం. ఈ రథాకారంలో వున్న పడవ యిక్కడ నదిలో వున్నదని మీ కెలా తెలిసింది?" అని అడిగాడు.

తను చెప్పే మాటల్లో ఖడ్గ జీవదత్తు లకు నమ్మకం కలగటం లేదని గ్రహిం చిన వీరపుర మంత్రి దుస్తుల్లో నుంచి వెడల్పాటి ఒక తాళపత్రాన్ని తీసి, "జీవదత్తా, రాత్రి ఆ యక్షుడు రాజ భవనం మీద వదిలిపోయిన యీ తాళ పత్రంలో తతిమ్మా విషయాలతో పాటు, నదిలో యిక్కడ పడవ వుంటుందన్న సమాచారం కూడా వున్నది. ఇదుగో, చూడు." అంటూ పత్రాన్ని జీవదత్తుడి కిచ్చాడు.

జీవదత్తుడు తాళపత్రాన్ని సాంతం చదివి ఖడ్గవర్మకు యిచ్చి, "మహా మంత్రీ, యిప్పుడు మీరు చెప్పిన సంగ తుల గురించి నా కెలాంటి అనుమానమూ లేదు. పద్మపురంలో ఆ యక్షుడు వదిలి



పోయిన తాళపత్రంలోని వ్రాతకూ, దీనికీ చాలా దగ్గిర పోలికలున్నాయి." అన్నాడు.

ఖడ్గవర్మ తాళపత్రంలోని విషయాన్ని ఒకటికి రెండుసార్లు చదివి మంత్రితో, "మహామంత్రీ, యీ పత్రాన్ని మా దగ్గిరే వుండనిస్తారా? వింధ్య ప్రాంతాల వున్న యక్షపర్వతాన్ని చేరినప్పుడు, ఆ ధూర్త యక్షుణ్ణి పట్టుకునేందుకు యిది సాయ పడవచ్చు." అన్నాడు.

వీరపుర మంత్రి అంగీకార సూచకంగా తలాడించి, నది కేసి చూసి, "అదుగో, పడవ ఒడ్డుకు చేరింది. ఆ పడవ నడిపే వాడు తన మిత్రుడని యక్షుడు రాశాడు



గదా. వాడెలాంటి జిత్తులమారి అయి వుంటాడో చెప్పలేం. మీరు తగు జాగ్రత్తలో వుండండి. మా రాజకుమార్తెను బంధ విముక్తురాలిని చేసి తెచ్చినవారికి, రాజుగారు ఆమెనిచ్చి వివాహం చేసి అర్ధ రాజ్యం యిస్తాడు,'' అన్నాడు..

ఆ మాటకు జీవదత్తుడు నవ్వి, ''ఎంతో కాలం కిందట పద్మసేన మహారాజు కుమార్తె పద్మావతికి, కేవలం మేం మహా వీరులం అని రుజువు చేసేందుకే వింధ్య పర్వతాల్లో వున్న రాతిరథాన్ని కదిలిస్తాం అని చెప్పాం. రాజ్య లాభమూ, రాజ కుమార్తెలతో వివాహ ప్రసక్తి అదంతా ఆ దుష్టుడైన యక్షుడి సంహారం తరవాత గాని మేము ఆలోచించ దలచలేదు.'' అన్నాడు.

ఆ సరికి పడవ ఒడ్డు చేరింది. పడవ ముందు భాగానికి యక్షుడిలా భూషణాలంకారాలు ధరించిన వ్యక్తి ఒకడు వచ్చి, ఖడ్గ జీవదత్తుల కేసి చెయి చూపాడు. ఖడ్గ జీవదత్తులు, వీరపుర మంత్రితో కలిసి పడవను సమీపించారు.

యక్షుడు ఒక క్షణకాలం అందరినీ పరీక్షగా చూసి, ''వింధ్యపర్వతాల్లో వున్న రాతిరథాన్ని కదిలించే మహావీరులు మీలో ఎవరు?'' అని అడిగాడు.

ఖడ్గ జీవదత్తులు మౌనంగా చేతు లెత్తారు. యక్షుడు యీసారి కొంచెం హేళనస్ఫురించే స్వరంతో, ''అయితే, మీ యిద్దరూ నిర్భయంగా పడవలోకి రావచ్చు. నా మిత్రుడైన యక్షమణి రంజితుడు వుండే యక్షపర్వతానికి మిమ్ములను తీసుకుపోతాను. అతడు వివాహమాడదలిచిన పద్మావతీ, వసంత కుమారీ అనే రాజకన్యలు అక్కడే వున్నారు,'' అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు నీటి అంచు నుంచి ఎగిరి పడవలోకి దూకారు. జీవదత్తుడు, యక్షుణ్ణి, ''నువ్వు, అసహాయులైన రాజ కుమార్తెలను రాత్రివేళ అపహరించుకు పోయే యక్షమణిరంజితుడి మిత్రుడివా?



అతడు పంపగా వచ్చావన్న మాట! నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నా పేరు మణిభూషణుడు. నా మిత్రుడైన మణిరంజితుడిని గురించి మీకు ఏమీ తెలియనట్టున్నది. శౌర్యసాహసాల్లో అతడి కతడేసాటి. మంత్ర తంత్ర శక్తుల్లో అందెవేసిన చేయి. మీరు అతడుండే యక్షపర్వతాని కొచ్చి, అనవసరంగా ప్రాణాపాయం ఎందుకు కొని తెచ్చుకుంటారు. వెనుదిరిగి మీ గృహాలకు పోయి సుఖంగా జీవించరాదా?" అన్నాడు మణిభూషణుడు.

మణిభూషణుడు మాట ముగించే లోపలే జీవదత్తుడు తన చేతిలోని దండాన్ని అతడి భుజానికి ఆనించాడు. యక్షుడు దండం తాకగానే పిడుగు దెబ్బ తిన్నవాడిలా ఎగిరి గంతేసి, నిలువెల్లా వణికిపోతూ, "ఏమిటది? మంత్ర దండమా? నీలో అంత గొప్ప మంత్ర శక్తులున్నవా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు జీవదత్తుడు నవ్వి, దండాన్ని ఖడ్గవర్మ చేతికిచ్చి, చిన్నగా ఏదో జపించి, యీసారి యక్షుడి భుజాన్ని తన వేలితో తాకాడు. యక్షుడు ఒక్క చావుకేక పెట్టి దభీమంటూ కిందపడి పోయి, కొద్ది సేపటి తర్వాత ఆయాస పడుతూ లేచి, "నువ్వు జీవదత్తుడివే గదా? నీ మంత్ర శక్తి అమోఘం! నా స్నేహితుడికి సరి అయిన ఉజ్జీవి. మీ ఇద్దరికీ శత్రుత్వం ఎందుకు? ఎవరి ఆటంకం లేకుండా మీరనే ఆ రాతి రథాన్ని కదిలించే మార్గం నేను చెపుతాను. ఆ పని చేసి మీ దారిన మీరు పొండి. మీ ప్రతిజ్ఞ నెరవేరినట్టవుతుంది." అన్నాడు.

ఖడ్గవర్మ పళ్ళు కొరుకుతూ కత్తి పైకెత్తి, "ఒరే, యక్షుడా! ఊరికే బింకాలు పలకకుండా పడవను ఆ యక్ష పర్వతం కేసి నడుపు. నీ మిత్రుడు రాజకుమార్తె లిద్దరినీ చెరనుంచి విడిపించి, క్షమాపణ కోరాడో సరి, లేకపోతే అతణ్ణి



ముక్కలుగా నరికి వింధ్యపర్వతాల్లోని కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాం," అన్నాడు.

ఇద్దరు మానవ మాత్రులు తనను యింతగా హడలకొట్టటం చూసి మణి భూషణుడు అవమానంతో, కోపంతో విల విల లాడిపోతూ, "క్షత్రియ యోధుల్లారా, మిమ్మల్ని మణిరంజితుడు తన వద్దకు తీసుకురమ్మన్నాడు. ఆ పని నెర వేర్చి, నా దారిన నేనుపోతాను. రాజ కుమార్తెల అపహరణా, రాతిరథం గొడవల్తో నాకే ప్రమేయంలేదు," అన్నాడు.

"నీలోవున్న గర్వం, అహంలాటి వ్యాధులుపోయి, మామూలు మర్యాదలు పాటిస్తూ మాట్లాడినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఇక చుక్కాని పట్టి పడవను నది మధ్యకు నడుపు," అని జీవదత్తుడు. ఒడ్డున వుండి యీ జరుగు తున్నదంతా అత్యాశ్చర్యంతో చూస్తున్న వీరపుర మంత్రితో, "మహామంత్రీ, ప్రస్తు తానికి సెలవు. వసంతకుమారిని బంధ విముక్తురాలిని చేసి తీసుకు వచ్చేందుకు నేనూ, ఖడ్గవర్మా ప్రతిజ్ఞ చేశామని మీ రాజు గారితో చెప్పండి. వీలయితే ఆమెను అపహ రించుకుపోయిన యక్షమణిరంజితుడి తల కూడా నరికి తెస్తాము. రాజుగారు దాన్ని కోటగొమ్మకు వేళ్లాడదీయవచ్చు." అన్నాడు.

వీరపుర మంత్రికి ఆ సమయంలో ఖడ్గ జీవదత్తులు అన్నంత పనీ చేస్తారన్న నమ్మకం కలిగింది. పడవ ఒడ్డు నుంచి నీటిలోకి పోతూండగా అతడు చేయెత్తి వాళ్ళిద్దర్నీ దీవిస్తూ, "శీఘ్రమే కార్య సిద్ధికలుగుగాక!" అన్నాడు.

పడవ నీటివాలున వేగంగా పోసాగింది. ఖడ్గ జీవదత్తులు పడవలో అన్నిచోట్లా తిరిగి, అది యక్ష మణిరంజితుడు గాలిలో ఎగిరేందు కూడా ఉప యోగించేదేమో అన్న అనుమానం కలిగి, చుక్కాని దగ్గిర వున్న మణి భూషణుణ్ణి ఆ సంగతి అడిగారు.

వాడికి యిప్పుడు ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూంటే ప్రాణభయం కలుగుతున్నది. ఏదో సామాన్య మానవులు, కాస్త కత్తి యుద్ధంలో ప్రవీణులైన క్షత్రియయువకు లిద్దర్ని బెదరకొట్టి తన పడవలో ఎక్కించుకుని యక్షపర్వతం దగ్గిరకు పోవచ్చనుకుంటూ వాడు వచ్చాడు. కాని చూస్తూంటే యువకులిద్దరూ సాహసికులేకాక, మంత్ర తంత్ర శక్తులున్న వాళ్ళలా కూడా అతడికి కనిపించారు.

ఖడ్గ జీవదత్తు లడిగిన ప్రశ్నకు యక్షుడు ఒకటి రెండు క్షణాలు జవాబిచ్చేందుకు తటపటాయించి చివరకు, "ఖడ్గ జీవదత్తుల్లారా, మణిరంజితుడు ఆకాశ గమనానికి ఉపయోగించే రాతి రథం యిది కాదు. అతడికి రథాకారంలో వున్న వస్తువు లంటే తగని మక్కువ. అందుకనే అతడు నివశించే గృహం దగ్గిర నుంచి, వాహ్యాళికి నదిలో తిరిగే యీ పడవ వరకూ—అన్నీ రథాకృతిలో నిర్మించుకున్నాడు," అన్నాడు.

జీవదత్తుడు కోపంగా తలవూపి, "అలాగా, పాపం! వాడు మా చేత చిక్కిన తరవాత, రథాకృతిలో వున్న ఏ చెట్టుకొమ్మకో ఉరితీస్తాం. అలాంటి చెట్లు మీ యక్షపర్వతం మీద వున్నయ్యా?" అని అడిగాడు.



యక్షమణిభూషణుడు యీ ప్రశ్నకు జవాబివ్వకుండా తల పక్కకు తిప్పుకున్నాడు. ఖడ్గ జీవదత్తులు యక్షుణ్ణి వదిలి, నదికి రెండు వైపులా వున్న ఎత్తయిన మహాపర్వతాలనూ, వాటి మీద చిత్త ఒత్తుగా పెరిగివున్న వృక్షాలనూ చూడసాగారు. వాళ్ళ కిప్పుడు తాము వింధ్యపర్వత ప్రాంతాల గుండా ప్రవహిస్తున్న ఒక మహానదిలో ప్రయాణిస్తున్నామన్న అనుమానం కలిగింది. మణిభూషణుణ్ణి ప్రశ్నించగా, ఆ కనబడేవి వింధ్యపర్వతాలే అని చెప్పాడు.

"ఈ పర్వత ప్రాంతాల్లో నువ్వనే ఆ యక్షపర్వతం యింకెన్ని ఆమడల

దూరంలో వున్నది?'' అని అడిగాడు జీవదత్తుడు.

''ఇంకొక పదీపన్నెండామడల దూరం వుంటుంది. సూర్యాస్తమయానికి మరెంతో కాలం లేదు. పడవను ఎక్కడైనా ఒడ్డుకు చేర్చి, భోజనాలు ముగించుకుని తిరిగి ప్రయాణం సాగించుదాం,'' అన్నాడు మణిభూషణుడు.

జీవదత్తుడికి అలా చేయటమే బావుంటుందని పించింది. కాని, పడవలో తినేందుకు పళ్ళూ ఫలాలూ తప్ప మరేం లేవు. పడవను ఒడ్డుకు పట్టిస్తే, ఆ ప్రాంతాల ఆహారంగా ఉపయోగించే పశుపక్ష్యాదులకు కొరత వుండదన్న నమ్మకం కలిగింది అతడికి.

జీవదత్తుడు, ఖడ్గవర్మను సలహా అడిగాడు. అతడు అస్తమించబోతున్న సూర్యుడి కేసీ, నది అంచున వున్న కొండల కేసీ ఓ మారు చూసి, ''మనం యీ రాత్రికి యీ నది ఒడ్డునే భోజనం ఏర్పాట్లు చేసుకుని, హాయిగా నిద్రపోయి, తిరిగి సూర్యోదయంతోనే ప్రయాణం సాగించటం బావుంటుంది,'' అన్నాడు.

జీవదత్తుడు, మణిభూషణుడితో, ''విన్నావా, ఖడ్గవర్మ చెప్పింది? పడవను ఒడ్డు కేసి పోనీ,'' అన్నాడు.

మణిభూషణుడు కాస్త చిరాకు పడుతూ, "నా మిత్రుడైన మణిరంజితుడు మిమ్మల్ని సాధ్యమైనంత త్వరగా యక్ష పర్వతాల దగ్గిరకు తీసుకు రమ్మన్నాడు. ఈ రాత్రికి మనం యిక్కడ వుండిపోతే, చాలా కాలయాపన జరిగిపోతుంది,'' అన్నాడు.

జీవదత్తుడు కఠినమైన స్వరంతో, ''ఇక్కడ ఆజ్ఞలు యిచ్చేది నేను, ఆ కన్యాపహరణంలో చేయి తిరిగిన నీ మిత్రుడు మణిరంజితుడు కాదు! చుక్కాని తిప్పి పడవను ఒడ్డుకు పోనియ్యి, విన్నావా?'' అన్నాడు.

మణిభూషణుడు కిక్కురు మనకుండా పడవను నది మధ్య నుంచి, ఒడ్డు కేసి నడిపాడు. —(ఇంకావుంది)






# మారిన మనసు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ మనోనిశ్చయానికి ఎంతైనా మెచ్చుకోవచ్చు. కాని, అవంతీనగరపు యువరాజైన అమరధ్వజుడి లాగా నువు మనసు మార్చుకుంటా వేమోనని నాకు సందేహంగా ఉన్నది. శ్రమ తెలియకుండా అతని కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం అవంతీనగరపు పరిసర ప్రాంత మంతా- అనేక వందల యోజనాల మేర భయంకరమైన కీకారణ్యంగా ఉండేది. ఆ కీకారణ్యం మధ్య, జన పదాలకు చాలా దూరంగా భిల్లులు నివసించే వారు. వాళ్ళకు నాగరిక ప్రపం

## బేతాళ కథలు



గించకుండా చంపేశాడు. అతనికి ఏ జంతువు భయమూ లేదు. పెద్దపులులనూ, సింహాలనూ సైతం చంపటం అతనికి అవలీల.

ఒకనాడు అమరధ్వజుడు తన చేత దెబ్బతిని పారిపోయిన పులిని తరుముతూ అరణ్యంలో చాలా దూరం పోయి, అనుకోకుండా భిల్లపల్లె చేరాడు. అక్కడ అలాటి పల్లె ఉన్నదనీ, అందులో ఆటవికులు ఉంటున్నారనీ అతనికి తెలియదు. భిల్లపల్లెను చేరుతూనే అతను చాలా అందగత్తె అయిన భిల్ల కన్యను చూశాడు. ఆమె పులి పిల్లలతో ఆడుకుంటున్నది.

చంతో ఏమీ సంబంధం లేదు. తమ చుట్టూ ఉండే అరణ్యంలో క్రూర మృగాలు నివసించినట్టే వాళ్ళూ జీవించే వాళ్ళు. ఆటవిక జాతుల కన్నిటికీ ఉన్నట్టే వాళ్ళకూ ఒక నాయకుడు ఉండేవాడు. భిల్లపల్లెలో అందరూ ఆ నాయకుడు చెప్పినట్టు నడుచుకునే వారు. అతని నిర్ణయానికి తిరుగు ఉండేది కాదు.

అవంతీనగరపు యువరాజు అమరధ్వజుడు తరచుగా అరణ్యాలలో వేటాడేవాడు. అతను మహా బలశాలీ, సాహసీ కూడా. ఎన్నోసార్లు అతను క్రూర మృగాలను ఎదుర్కొని, ఆయుధం ఉపయో

భిల్లకన్యా, యువరాజూ ఒకరి నొకరు అమిత ఆశ్చర్యంతో చూసుకున్నారు. సృష్టిలో ఆడదానికి ఏ ఆభరణాలూ, అలంకరణలూ లేకుండా అంత అందం ఉండటం యువరాజుకు ఆశ్చర్యం కలిగించింది. భిల్లులను తప్ప ఏ నాగరిక పురుషుణ్ణీ చూడని భిల్లకన్య యువరాజు దుస్తులూ, వాలకమూ చూసి తన కళ్లను తానే నమ్మలేక పోయింది. అతను ఎవరో దేవుడై ఉంటాడనుకుని, ఈ సంగతి అందరికీ చెప్పటానికి గూడెంలోకి పరిగెత్తింది. యువరాజు కూడా ఆమె వెంట వెళ్ళాడు.

త్వరలోనే అమరధ్వజుణ్ణి అనేక మంది భిల్లులు పొడుగుపాటి ఈటెలతో చుట్టు ముట్టారు. ఆ పిల్లకూడా వారి వెంట ఉన్నది. అమరధ్వజుడు వాళ్ళతో, ''నేను అవంతీనగరపు యువరాజును. మీకు అభ్యంతరం లేకపోతే ఈ పిల్లను పెళ్ళాడతాను,'' అన్నాడు.

భిల్లులు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. వారిలో వృద్ధుడు ఒకడు అతన్ని తన వెంట రమ్మని, తమ నాయకుడి వద్దకు తీసుకుపోయాడు. భిల్ల నాయకుడు అతని కోరిక తెలుసుకుని, ''ఈ పిల్లను పెళ్ళాడ గోరితే నువు ఒక పరీకలో నెగ్గాలి. అందుకు నువు సిద్ధమేనా?'' అని అడిగాడు.

అమిత సాహసి అయిన అమరధ్వజుడు తాను ఏ పరీక్షకైనా సిద్ధమేనన్నాడు.

''అయితే పద,'' అంటూ భిల్ల నాయకుడు అతణ్ణి అరణ్యంలో ఒక ఖాళీజాగాలోకి తీసుకు పోయాడు. చూస్తూండగానే భిల్లులందరూ, ఆడవాళ్ళతోనూ, పిల్లలతోనూ సహా వచ్చి అక్కడ చేరారు. భిల్ల నాయకుడు వాళ్ళ నందరినీ ఒక వలయంగా నిలబెట్టాడు.

కొద్ది సేపటికి ఆ వలయంలోకి ఒక మహా బలశాలి వచ్చాడు. వాడి వెంట డప్పులు వాయించుకుంటూ కొందరు వచ్చారు. ఏనుగుగున్న లాంటి వాడి శరీరాన్ని, అమిత వికారంగా ఉన్న వాడి





ముఖాన్ని చూసి అమరధ్వజుడికి చాలా అసహ్యం కలిగింది.

ఆ భయంకరుణ్ణి చూపిస్తూ భిల్ల నాయకుడు అమరధ్వజుడితో, "మా గూడెంలో వాడి కన్న బలవంతుడు లేడు. నువు మా పిల్లను పెళ్ళాడాలంటే వాణ్ణి జయించాలి," అన్నాడు.

అమరధ్వజుడు భిల్ల నాయకుడితో, "మీ పిల్లకు వరుణ్ణి నిర్ణయించటానికి ఇది సరి అయిన పద్ధతి కాదు. ఈ యోధుణ్ణి జయించటానికి పశుబలం చాలును. కాని వివాహానికి అర్హుడైన వాడికి బుద్ధి బలమూ, అంద చందాలూ అవసరం కాదా?" అన్నాడు.

"మేము అడవిలో బతికే వాళ్ళం. మా పద్ధతులు మావి. మీ పద్ధతులు మాకు అవసరం లేదు. నీకు మా యోధుడితో పోరాడటానికి ఇష్టం లేకపోతే, నీ దారిన నువు వెళ్ళిపోవచ్చు," అన్నాడు భిల్ల నాయకుడు.

ఈ మాటకు అందరూ నవ్వారు.

"నేను అతనితో పోరాడటానికి సిద్ధమే," అన్నాడు అమరధ్వజుడు. వెంటనే అందరి నవ్వులూ నిలిచిపోయి, నిశ్శబ్దం ఏర్పడింది.

ఇద్దరికీ యుద్ధం ఆరంభం అవుతూనే భిల్ల యోధుడు అమరధ్వజుణ్ణి అవలీలగా ఎత్తి, దూరంగా విసిరి వేశాడు. అందరూ చప్పట్లు చరిచి నవ్వారు. భిల్ల కన్య కూడా చప్పట్లు చరిచి, నవ్వింది.

భిల్లుడి బలం క్షణంపాటు అమరధ్వజుడికి ఆశ్చర్యం కలిగించింది. అయితే వాడికి పశు బలమే తప్ప, మెదడు లేదనీ, యుక్తులు ఏమీ తెలియవనీ అతను కనిపెట్టాడు. అందు చేత అతను పడిన చోటి నుంచి లేచి వచ్చి, తనను వాడు సమీపిస్తూండగా, మెరుపులాగా కాలెత్తి, వాడి డొక్కలో బలంగా తన్నాడు. వాడు భయంకరంగా అరిచి, అమరధ్వజుడి మీద పడబోయాడు. అమరధ్వజుడు పక్కకు తప్పుకుని, అర

చెయ్యి అడ్డంగా తిప్పి వాడి మెడనరం తెగేలాగా శక్తికొద్దీ కొట్టాడు. భిల్ల యోధుడు ఘీంకారం చేస్తూ పడి పోయాడు. మళ్ళీ అందరూ చప్పట్లు చరిచారు. భిల్లకన్య కూడా చప్పట్లు చరిచింది.

భిల్లనాయకుడు అమరధ్వజుణ్ణి భుజం మీద తట్టి, "భేష్! నువు గొప్ప యోధు డివి, సందేహం లేదు. మా పిల్లకు తగిన వరుడివి. మీ ఇద్దరికీ పెళ్ళి చేస్తాను," అన్నాడు.

"నాకు ఆ పిల్లను పెళ్ళాడాలన్న ఉద్దేశం మారిపోయింది. నన్ను వెళ్ళి పోనియ్యండి," అన్నాడు అమరధ్వజుడు, భిల్లనాయకుడితో.

అతను కొద్దిదూరం వెళ్ళాడో లేదో, భిల్లులు అతన్ని చుట్టుముట్టారు.

భిల్లనాయకుడు అతన్ని సమీపించి, "చూడు, బాబూ, ఒక్క సంగతి విని మరీ వెళ్ళు. నీ చేత చచ్చినవాడు నువు పెళ్ళాడతానన్న పిల్లను పెళ్ళాడవలసిన వాడు. ఆమెను పెళ్ళాడ గోరిన వాళ్ళం దరినీ వాడు లోగడ ఓడించాడు, కొందరిని చంపాడు కూడానూ. అందుకే నీకు వాడితో పోటీ పెట్టాను. ఇక నువు వెళ్ళ వచ్చు," అన్నాడు.

అతన్ని చుట్టుముట్టిన భిల్లులు తమ నాయకుడి సైగ గ్రహించి అమరధ్వజుడికి దారి ఇచ్చారు. కాని అతను ముందుకు కదల లేదు; కొంచెంసేపు అక్కడే నిలబడి



ఆలోచించి, ''నేనామెను పెళ్లాడతాను,'' అన్నాడు.

నాయకుడు వారిద్దరికి పెళ్ళితంతు జరిపి, ఆ పిల్లను అతని వెంట పంపేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, ''రాజా, యువరాజు ఆ పిల్లను పెళ్లాడాలన్న ఉద్దేశాన్ని ఎందుకు మార్చుకున్నాడు? తనను భిల్లయోధుడు విసిరి పారేసినప్పుడు హర్షించిందనా? అలా అయితే మళ్ళీ మనసు మార్చుకుని ఆమెను ఎందుకు చేసుకున్నాడు? తనను పోనిచ్చినట్టే పోనిచ్చి, వెనక నుంచి తనను చంపేస్తారనా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తాను భిల్ల కన్యను పెళ్ళాడాలంటే ఒక పశుప్రాయుడితో పోట్లాడాలనీ, భిల్లుల ఆచారాలు అలాటివనీ తెలిసినప్పుడే యువరాజుకు భిల్లకన్యను పెళ్ళాడాలన్న కోరిక పోయింది. తాను పిరికివాడని పించుకోకుండా ఉండటానికే ఆ భిల్ల యోధుడితో పోట్లాడాడు. భిల్లకన్య తన పాటుకు హర్షించిందన్న అపోహ అతనికి కలిగే అవకాశం లేదు. ఎందుచేతనంటే, తనకు భర్త కావలిసినవాడు చచ్చినప్పుడు కూడా ఆమె హర్షించింది. అయితే, యువరాజు ఆమెను పెళ్ళాడటానికి కారణం ఏమంటే, ఆమెను పెళ్ళాడవలసిన వాణ్ణి తాను చంపాడు; ఇక, ఆమెను పెళ్లాడగోరిన వాళ్ళందరినీ వాడు ముందేచంపటమో, జయించటమో జరిగింది. శౌర్యాభిలాషగల ఆ భిల్లకన్య మరొక వీరుణ్ణి భర్తగా సంపాదించే అవకాశం దాదాపు లేదు. వీరుడుగా తనను ఆమె పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నది. అందుచేత యువరాజు రెండో సారి మనసు మార్చుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)





# రాజప్రతినిధి గుర్రాలు

చిత్రసేనుడు మహేంద్రదేశాన్ని పాలించే రోజుల్లో ఆ దేశంలో పాడిపంటలు సమృద్ధిగా ఉండటంతో బాటు వర్తకవ్యాపారాలు బాగా అభివృద్ధి అయాయి. దేశంలో ఆహారంతో బాటు వెండి, బంగారాలూ, రత్నాలూ సమృద్ధిగా ఉండేవి. దీని ఫలితంగా కొన్ని వర్తక కేంద్రాలు మహానగరాలుగా పెరిగాయి.

ఇలా పెరిగిపోయిన నగరాలలో పౌర జీవితమూ, పరిపాలనా విధానాలూ వేరుగా ఉండేటట్టు చూడవలసి వచ్చింది రాజుకు. అందుకోసం అలాటి నగరాలలో రాజప్రతినిధుల పరిపాలన ఏర్పరచాలనుకున్నాడు రాజు. ఆ రాజప్రతినిధులను ఎన్నుకొనే బాధ్యత నగర పౌరులకే వదిలితే, 'సరి అయిన రాజప్రతినిధులు నియామకమవుతారనీ, వాళ్ళ పరిపాలనను తాను అప్పుడప్పుడూ సమీక్ష చేస్తూ ఉండవచ్చుననీ చిత్రసేనుడు అభిప్రాయ పడ్డాడు.

మహేంద్రదేశంలో రాజధాని తరవాత అంతపెద్ద నగరం ఆనందపురం. అక్కడ మొట్టమొదట రాజప్రతినిధికి ఎన్నిక జరిపి, తన పథకం ఎలా పనిచేసేదీ చూడాలని రాజు నిర్ణయించాడు. ఆనందపురం చాలా పెద్ద వాణిజ్యకేంద్రం. అక్కడి జన సంఖ్య పదిలక్షలు. ఆ నగరంలో అనేక గొప్ప భవనాలూ, విశాలమైన రాజమార్గాలూ ఉన్నాయి. అక్కడ విదేశీయుల రాకపోకలు విస్తారంగా ఉంటాయి.

చిత్రసేనుడు తన నిర్ణయాన్ని మహామంత్రి చతురుడికి చెప్పాడు.

"అంతా ఒకే కుదురులో జీవించే జాతులవాళ్ళు తమ నాయకుణ్ణి ఎన్నుకున్నట్టుగా మహానగర వాసులు తమ

"వసుంధర"



పన్నెండు పేటలుగా విభజించి, ఒక్కొక్క పేటకూ ఒక్కొక్క పాలకుణ్ణి ఎన్నుకో మంటే ప్రజలు సులువుగా ఎన్నుకుంటారు. ఆ పన్నెండుమందీ కలిసి తమ నాయకుణ్ణి ఎన్నుకుంటే అతను నగర పాలకుడుగా ఉంటాడు; మిగిలిన వాళ్ళు అతని కింద ఉపపాలకులుగా ఉండి, అతనికి సహాయం చేస్తూ ఉంటారు.

ఈ ఏర్పాటు గురించి ఆనందపురంలో ప్రకటన జరిగింది. వెంటనే ఎన్నికల సంరంభం సాగింది.

ఆనందపురంలో సుచారుడు అనే విద్యావంతుడు ఉన్నాడు. అతను ఆ నగరంలోనే పుట్టి పెరిగినవాడు. అతనికి ఆ నగరమే పంచప్రాణాలు. అతను ఆ నగర జీవితాన్ని క్రమబద్ధం చెయ్యటానికి ఎంతో కృషి చేశాడు. అక్కడ ఇప్పుడు ప్రత్యేక పరిపాలన ఏర్పడబోతున్నదంటే నగర జీవితం ఇంకా అభివృద్ధి చేయవచ్చునని అతనికి అనిపించింది. అతను కూడా రాజప్రతినిధి ఎన్నికకు నిలబడదలిచాడు. అతని నాయకత్వాన ఒక యువకుల సేన కూడా ఉన్నది.

సుచారుడిలాగే అనేకమంది పేరుపడ్డ ధనికులూ, వర్తకులూ ఎన్నికలో ఆసక్తి ప్రదర్శించారు. నూతనంగా ఏర్పడే పరి

పాలకుణ్ణి ఎన్నుకోగలరని తోచదు. సమర్థుడని తోచినవాణ్ణి మీరే నాయకుడుగా నియమిస్తే బాగుంటుందని నా అభిప్రాయం,'' అన్నాడు మంత్రి.

చతురుడి సలహా చిత్రసేనుడికి నచ్చలేదు. నగరపాలకుణ్ణి ఏర్పాటు చేస్తున్నది నగరవాసుల సౌకర్యార్థం. తమ సౌకర్యాలు నగర వాసులకే బాగా తెలుస్తాయి. వాటికోసం కృషి చేయగల వాణ్ణే వాళ్ళు ఎన్నుకుంటారు. ఇందులో పొరపాటు జరిగే అవకాశం ఏమున్నదీ?

పదిలక్షలమంది ఒకణ్ణి ఎన్నుకోవటంలో కొన్ని చిక్కులున్నాయి. అందుచేత చిత్రసేనుడు ఆనందపురాన్ని

పాలనలో తమకు ప్రాముఖ్యం ఉండా లని వారి కోరిక. అందుచేత వాళ్ళు ప్రజలకు విచ్చలవిడిగా డబ్బు పంచి పెట్టి, తమ దగ్గిర వాళ్ళనూ, తమ చెప్పుచేతలలో ఉండేవాళ్ళనూ ఎన్ని కలలో గెలిపించారు. పన్నెండుమంది విద్యాహీనులూ, విలాసపురుషులూ ఉప రాజప్రతినిధులుగా ఎన్నిక అయారు. సుచారుడికీ, అతని అనుచరులకూ ఘోర పరాజయం కలిగింది.

సుచారుడి పరాజయం రాజును కూడా కలవరపరిచింది. రాజప్రతినిధి కావ టానికి అతనికన్న అర్హుడు లేడని రాజుకు తెలుసును. అంతతో పోక, పన్నెండు మంది భ్రష్టులు ఎన్నికలలో నెగ్గారు!

మంత్రి చతురుడు రాజుతో, "మహా రాజా, నిక్షేపంలాంటి నగరాన్ని ఈ మూర్ఖుల చేతిలో పెట్టకండి. ప్రజలు తమకు మేలు చేసేవారిని ఎన్నుకోలేరని రుజువయింది కద! తమరే తగిన వాణ్ణి చూసి—" అని ప్రారంభించాడు.

ఆయన మాట పూర్తి కాకుండానే రాజు, "ప్రజలకు అతనిలో విశ్వాసం లేదని రుజువయింది. సుచారుడు దీక్ష గల వాడు కావచ్చు, కాని ధనం కల వాడు కాడు. ప్రజలు ధనవంతులను ఎన్నుకున్నారు. ఎలా కాదన గలం?" అన్నాడు.

అయితే రాజప్రతినిధి ఎన్నిక మాత్రం ఎంత కాలానికీ జరగలేదు. ఉపరాజ





మంత్రి రాజుతో రహస్యంగా, "తమ నాయకత్వపు సమస్యను పరిష్కరించుకో లేని ఈ మూర్ఖులు ప్రజల సమస్యలను ఏం పరిష్కరించ గలరు? తమలే ఆలో చించండి," అన్నాడు.

"ఇది వాళ్ళ వినయానికి చిహ్నం. మూర్ఖత కాదు," అన్నాడు రాజు.

తరవాత ఆయన ఆ పన్నెండు మంది లోనూ కాస్త కంటికి నదరుగా కనిపించే ధనగుప్తుడు అనే వాణ్ణి రాజ ప్రతినిధిగా నియమించి, తన రాజధానికి తిరిగి వెళ్ళాడు.

ప్రత్యేక నగరపరిపాలన ఏర్పడటంతో కొత్త సమస్యలు బయలుదేరాయి. ప్రతి ఒక పేటవాళ్ళూ తమకు కొత్త సౌకర్యాలు కావాలని తమ తమ ప్రతినిధులను పీడించసాగారు. ఒక పేటలో ఏదైనా ఒక అభివృద్ధి కార్యక్రమం ప్రారం భించిన మరుక్షణం మరికొన్ని పేటలలో ఆందోళన ప్రారంభ మయేది. ప్రజలలో ఈ ఆందోళనలు రెచ్చగొట్టు తున్నది ఉపరాజ ప్రతినిధులేనని ధనగుప్తుడికి తెలుసు: వారంతా తనకు సహాయకులు కారు, ప్రత్యర్థులు. వాళ్ళు తనకు తెచ్చి పెట్టే సమస్యలను ఎలా పరిష్కరించు కోవాలో ధనగుప్తుడికి తెలియదు. అందు చేత అతను సమస్య వచ్చినప్పుడల్లా

ప్రతినిధులు పన్నెండు మందిలో ప్రతి ఒక్కడికీ తానే రాజప్రతినిధి కావాలని ఉన్నది. అందుచేత వారు తమ నాయ కుణ్ణి ఎన్నుకోలేక పోయారు. నెల రోజులు గడిచింది.

ఎన్నిక ఎందుకు జరగటం లేదో తెలుసు కుందామని రాజు తన మంత్రితో సహా ఆనందపురం వచ్చి, ఉపరాజ ప్రతినిధులను సమావేశపరచి, "మీకు వచ్చిన సమస్య ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, తమరు ఎలాగూ రానే వచ్చారు గనక, మాలో ఒకరిని రాజ ప్రతినిధిగా తమరే నిర్ణయించండి." అన్నారు వాళ్ళు.



రాజధానికి వెళ్ళి రాజును సంప్రదించసాగాడు. ధనగుప్తుడు రాజప్రతినిధిగా ఉండటానికి పనికిరానివాడని రాజు త్వరలోనే గ్రహించాడు. అయినప్పటికీ అయన చతురుడి ముందు ఓటమి అంగీకరించలేక, ధనగుప్తుడు వచ్చినప్పుడల్లా అతనికి రాజనీతి బోధిస్తూ వచ్చాడు. అయితే రాజనీతి ధనగుప్తుడి బుర్రకు ఏ మాత్రమూ ఎక్కేది కాదు; అతనికి తెలిసినదల్లా ప్రతి సమస్యకూ పరిష్కారం రాజుగారి నుంచి తెలుసుకోవటమే. రాజు నిర్ణయాలు అమలు చెయ్యటం అతనికి క్షేమంగా కనబడింది.

అయితే ధనగుప్తుడికి ఒక పెద్ద చిక్కు వచ్చిపడింది. ఆనందపురానికీ, రాజధానికీ మధ్య చాలా దూరం ఉన్నది. మంచి గుర్రం మీద రోజున్నర ప్రయాణం. కనీసం వారానికి ఒక సారి ప్రయాణం చెయ్యాలి. ధనగుప్తుడు తన ప్రయాణాలకు నెలకు రెండు గుర్రాలను ప్రజల ద్రవ్యంతో కొనేవాడు. అతని వద్ద ఎనిమిది మేలుజాతి గుర్రాలు ఉన్నాయి. ఒకసారి ప్రయాణం చేసి వచ్చిన గుర్రానికి రెండు నెలలు విశ్రాంతి లభించేది. ఈ గుర్రాలను చూడటానికి ఆరితేరిన అశ్వరక్షకులూ, ఇద్దరు పశువైద్యులూ ఉండే వారు. గుర్రాల కోసం అందమైన భవనం నిర్మించబడింది. వాటికోసం మేలురకం ఆహారం పైదేశాలనుంచి వచ్చేది. నగర పరిపాలన యావత్తూ ఆ గుర్రాల ఆరోగ్యం పైనే ఆధారపడి ఉన్నదిమరి.

ఒక సంవత్సరం పూర్తికాగానే ధనగుప్తుడు తన నివేదికలను తీసుకుపోయి రాజుగారికి సమర్పించాడు. ఆ నివేదికలలో రాజుకు కొత్త విషయాలేమీ కనిపించలేదు. అమలు జరిగిన వన్నీ తన నిర్ణయాలే. ఎటొచ్చీ, అన్నిటి కన్న పెద్ద ఖర్చు పద్దు మహారాజుతో సంప్రదింపుల కింద కనబడింది. ఏ అభివృద్ధి పథకానికి అంత ఖర్చు కాలేదు. మహా



చిత్రసేనుడికి కొంచెం చురుకు తగిలింది. ఆయన మంత్రితో, "ఆనందపురం పరిస్థితి స్వయంగా చూడాలని ఉన్నది. ఒక పర్యాయం మనం మారు వేషాలలో వెళ్ళి, నగర పర్యటన చేసి వద్దామా?" అన్నాడు.

ఇద్దరూ మారువేషాలతో ఆనందపురంలో తిరుగుతూ, నగర వైభవాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు. వీధి వీధికీ వైద్యశాలలూ, మంచినీటి బావులూ ఉన్నాయి. దుకాణాలన్నీ ఒక పద్ధతిలో ఉన్నాయి.

చిత్రసేనుడు దారేపొయ్యే ఒక మనిషిని పలకరించి, "మీ రాజప్రతినిధి మంచి సమర్థుడు లాగున్నాడే? ఈ వైద్యశాలలూ, ప్రజాసౌకర్యాలూ రాజధానిలో కూడా లేవు," అన్నాడు.

దానికా మనిషి, "అయ్యా, మీరీ నగరానికి కొత్తలాగుంది. ఈ సౌకర్యాలు మాకు రాజప్రతినిధి రాకపూర్వమే ఉన్నాయి. సుచారుడూ, అతని యువసేనా ఈ నగరాన్ని ఏనాడో తీర్చిదిద్దారు. ఇక ధనగుప్తుడుగారి పరిపాలన అంటారా? అందులో మేం సుఖపడాలంటే గుర్రాలమై పుట్టాలి!" అని వెళ్ళిపోయాడు.

ధనగుప్తుడి పరిపాలనకూ, గుర్రాలకూ సంబంధం ఏమిటో రాజుకు అర్థంకాక,

మంత్రి చతురుడు తన వెంటనే ఉండటం చేత రాజు రాజప్రతినిధిని ఆ ఖర్చు వివరాలు అడగలేదు.

తరవాత రాజు మంత్రితో, "ధనగుప్తుడు చాలా నమ్మకమైన వాడు. అతను తన అధికారాన్ని ఏ మాత్రమూ దుర్వినియోగ పరచినట్టు కనబడదు," అన్నాడు.

చతురుడు నవ్వి, "అతను అధికారాన్ని వినియోగించిన దేమున్నది? అన్నీ మీరు చేసిన నిర్ణయాలే గద! అందుకే మీతో సంప్రదింపులకు అయిన ఖర్చు అభివృద్ధి పథకాల ఖర్చులన్నిటినీ మించి ఉన్నది," అన్నాడు.

మంత్రి కేసి ప్రశ్నార్థకంగా చూశాడు. చతురుడికి ఆ సంగతి అర్థం అయినట్టు కనబడలేదు.

తరవాత వాళ్ళు నగరంలోని అనేక మంది పౌరులను కలిసి చూశారు. దాదాపు అందరూ గుర్రాల ప్రస్తావన తెచ్చిన వాళ్ళే. ఆనందపురంలో మనిషిగా పుట్టటం కన్న గుర్రంగా పుట్టటం మేలన్నది సామాన్య అభిప్రాయంగా కనబడింది.

అనంతరం వాళ్ళు సుచారుణ్ణి కూడా కలుసుకున్నారు.

"మీరు నగరానికి చాలా సేవ చేశారుట. ఈ మాట చాలామంది నగరవాసులు చెప్పారు. అయినా ప్రజలు మిమ్మల్ని ఎందుకు ఎన్నుకో లేదు?" అని చిత్రసేనుడు సుచారుణ్ణి అడిగాడు.

"నేను ఎన్నికల కోసం ప్రజాసేవ మొదలు పెట్టిన వాణ్ణి కాను. అందు చేత, నన్ను ఎన్నుకోక పోయినా నేను ప్రజాసేవ మానననే ప్రజలకు తెలుసు. వాళ్ళు తమకు డబ్బిచ్చిన వారిని ఎన్నుకున్నారు," అన్నాడు సుచారుడు.

"అలాటప్పుడు మీరు ఎన్నికలకు ఎందుకు నిలబడ్డారు?" అన్నాడు రాజు.

"అధికారంలో ఉంటే ప్రజలకు మరింతగా సేవచేయగల నేమోనని!" అని సుచారుడు జవాబు చెప్పాడు.

"పదవిలో ఉన్నవారి కంటే మీరే ఎక్కువగా ప్రజాసేవ చేస్తున్నారు.



నగరం చూసిన ఎవరికైనా ఆ సంగతి తెలుస్తుంది.'' అన్నాడు రాజు.

''మీరు పొరబడుతున్నారు. ఇన్నేళ్ళుగా నా యువసేన ప్రజలకు ఏర్పరచిన సదుపాయాలు, ధనగుప్తుడు ఆరు నెలలలో గుర్రాలకు కలిగించిన సదుపాయాలలో సగమైనా ఉండవు. ఎలాగైనా ప్రజల జీవనస్థాయిని ఆ గుర్రాల జీవనస్థాయికి పెంచటం సాధ్యమవుతుందా అని చూస్తున్నాను.'' అన్నాడు సుచారుడు.

''నగరంలో ఎవరిని కదిలించినా రాజప్రతినిధి గుర్రాల మాటే తెస్తున్నారు.'' అన్నాడు రాజు.

సుచారుడు రాజుతో ధనగుప్తుడి గుర్రాలను గురించి వివరంగా చెప్పి, ''అతను మాత్రం ఏం చేస్తాడు? స్వయంగా ఏ నిర్ణయమూ చెయ్యలేడు. తోటి ఉపరాజప్రతినిధులు తన మాట వినేటట్టు చేసుకోలేడు. ప్రతి చిన్నవిషయాన్నీ రాజుగారితో సంప్రతించాలిసిందే! ఈ భాగ్యానికి రాజుగారు ఒక రాజప్రతినిధిని ఎందుకు నియమించాడా అని నాకు ఆశ్చర్యం కలుగుతుంది.'' అన్నాడు.

రాజు వెంటనే అధికారరీత్యా వెళ్ళి ధనగుప్తుడు తన అశ్వాల కోసం చేసిన ఏర్పాట్లు స్వయంగా చూశాడు. తనతో సంప్రతించటానికి ధనగుప్తుడు అంత ఖర్చు ఎందుకు చేశాడో ఆయనకు అర్థమయింది. రాజ ధనాన్ని ప్రజల కోసం కంటె గుర్రాల కోసం ఎక్కువగా ఖర్చు పెట్టె మూర్ఖుణ్ణి ఇంతకాలం నగరపాలకుడుగా కొనసాగనిచ్చి నందుకు రాజు తనను తానే నిందించుకున్నాడు. ఆయన వెంటనే ధనగుప్తుణ్ణి పదవిలో నుంచి తొలగించి, అతని స్థానంలో సుచారుణ్ణి రాజప్రతినిధిగా నియమించి, ఉపప్రతినిధులను నియమించే పని అతనికే అప్పగించాడు.

మరుసటి సంవత్సరం సుచారుడు రాజుకు సమర్పించిన నివేదికలో రాజుతో సంప్రతింపుల ఖర్చు పద్దే లేదు.





ఒక గ్రామంలో రాజయ్య అనే రైతుయువకుడు ఉండేవాడు. అతడికి దగ్గిర వాళ్ళు ఎవరూ లేరు. అతను యుక్త వయసు రాగానే పక్క గ్రామంలో ఉన్న ఒక రైతు కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరు సుబ్బమ్మ.

కొంత కాలం గడిచింది. ఒక నాడు సుబ్బమ్మ తన భర్తతో, "పండగకి ఒక పట్టుచీర కొనిపెట్టండి. పొరుగింటి నాంచారయ్య భార్య కొంటున్నది," అన్నది.

ఆ మాట విని రాజయ్య, "నాంచారయ్యకేం? ఏదైనా కొంటాడు. అలాంటి వాళ్ళతో మనం తూగగలమా?" అన్నాడు.

ఈ మాటకు సుబ్బమ్మ బాధపడి, "అడగక అడగక పట్టుచీర అడిగితే ఏమేమిటో చెబుతున్నారు. మా పుట్టింటి వాళ్ళు నేను నోరు చేసుకుని అడగాలే గాని, వెంటనే ఇస్తారు," అన్నది.

"అలా అయితే మీ పుట్టింటి వారినే పట్టుచీర కోరి, నీ ముచ్చట తీర్చుకో," అన్నాడు రాజయ్య.

రెండు రోజుల పాటు సుబ్బమ్మ అలిగి కూర్చున్నది. తాను పుట్టింటికి వెళ్ళి, వారినుంచి పట్టుచీర తెస్తేనే గాని తన పరువూ, తన పుట్టింటివారి పరువూ నిలవదని ఆమెకు తోచి, మూడోరోజు పుట్టింటికి ప్రయాణమయింది.

ఈ లోపలనే రాజయ్య జరిగినదంతా తన మామగారికి ఉత్తరం రాశాడు.

సుబ్బమ్మ మూడోరోజు జట్కాబండి తెప్పించి, "నేను మా పుట్టింటికి పోతున్నాను. పట్టుచీరతో తిరిగి రాకపోతే చూడండి!" అని భర్తతో శపథం చేసి మరీ బండీ ఎక్కింది.

త్వరలోనే ఆమె పుట్టింటి ముందు జట్కా దిగి, లోపలికి వచ్చింది.

ఐ. వెంకటేశ్వరరావు

ఆమె తండ్రి పడకకుర్చీలో కూర్చుని ఉన్నాడు. ఆయన సుబ్బమ్మను చూసి, "అమ్మాయ్, ఒక్క దానివే వచ్చావేం? అల్లుడు రాలేదా?" అని అడిగాడు.

"మీ అల్లుడు రాలేదు, నాన్నా. ఇంటి వద్ద పనులు ఉండిపోయాయి. నిన్నూ, అమ్మనూ, చూడాలనిపించి, ఒక్కదాన్నే వచ్చాను," అంటూ సుబ్బమ్మ ఇల్లంతా తిరిగి వచ్చి, "నాన్నా? అమ్మ కనిపించదేం? ఎక్కడికి వెళ్ళింది?" అన్నది.

"మీ అమ్మ నా మీద అలిగి మీ అమ్మమ్మ దగ్గిరికి వెళ్ళింది," అన్నాడు తండ్రి.

"అదేం? మీ రిద్దరూ పోట్లాడుకున్నారా?" అన్నది సుబ్బమ్మ.

"అదేమీ లేదమ్మా! పండగకు పట్టుచీర కొనమన్నది. కొనలేనని చెప్పాను. అలిగి వెళ్ళిపోయింది. నువ్వే చెప్పమ్మా. నీ పెళ్ళికి చేసిన అప్పు ఇంతవరకు తీరలేదుగదా, ఇప్పుడు పట్టుచీర తెమ్మంటే ఎలా చెప్పమ్మా!" అన్నాడు తండ్రి.

ఈ మాట విని సుబ్బమ్మ గతుక్కుమన్నది. ఆమె తన పొరపాటు గ్రహించి, వెంటనే తిరుగు ప్రయాణమయింది.

"అదేమిటమ్మా? అప్పుడే వెళ్ళిపోతావా? రెండు రోజులైనా ఉండవూ?" అన్నాడు తండ్రి.

"లేదు నాన్నా, నేను వెళ్ళాలి. అమ్మ వస్తే చెప్పు." అన్నది సుబ్బమ్మ.

"ఏం చెప్పమన్నావు?" అన్నాడు తండ్రి.

"అమ్మ ఇలా అలగటం ఏమీ బాగా లేదు. ఇంటి కష్టసుఖాలు ఆలోచించకుండా ఆవిడ పట్టుచీర కావాలంటే ఎలా? కాస్త ఇంటి పరిస్థితులు గమనించి మసులుకోమని చెప్పానని ఆవిడతో చెప్పు," అంటూ సుబ్బమ్మ తిరిగి జట్కాలో బయలుదేరి వెళ్ళింది.

సుబ్బమ్మ వెళ్ళి పోగానే ఆమె తల్లి పక్క ఇంటి నుంచి వచ్చి, "మీరూ అల్లుడూ చేరి, పాపం, చిన్న పిల్లను ఇలాగైనా చేసేది?" అన్నది నవ్వుతూ తన భర్తతో.





# ఇద్దరు మోసగాళ్ళ కథ

ఒక బ్రాహ్మణ గురువు ప్రతి ఏడూ అనేక గ్రామాలు సంచారం చేసి, శిష్యుల నుంచి వార్షికాలు పుచ్చుకుని తన గ్రామానికి తిరిగి వచ్చేవాడు. ఆయన మూటలు మొయ్యటానికి వెంట ఇద్దరు నౌకర్లు ఉండేవారు. కింద టేడు పంటలు బాగా పండటం చేత, ఈ యేడు బ్రాహ్మణుడి పంట పండింది. కానుకలు ఇద్దరు నౌకర్లూ మోయలేనంతగా లభించాయి. అందుచేత వాటిని మూడు పెద్దమూటలు కట్టించి, రెండింటిని తన నౌకర్ల కిచ్చి ఇంటికి చేర్చమని మూడో మూటతో బ్రాహ్మణుడు ఒక రహదారి సత్రంలో దిగాడు. నౌకర్లలో ఒకడు తిరిగివచ్చి, దిగబడి పోయిన మూటతో బ్రాహ్మణుడి వెంట ఇంటికి వెళ్ళేటట్టు ఏర్పాటు జరిగింది.

మూటతో సహా బ్రాహ్మణుడు సత్రంలో మకాం పెట్టటం ఇద్దరు మోసగాళ్ళు చూసి, ఆ మూటను కాజెయ్యాలనుకున్నారు. కాని బ్రాహ్మణుడు చాలా జాగ్రత్త మనిషి కావటం చేత, వాళ్ళు ఆ మూటను దొంగిలించటం సాధ్యపడలేదు.

అందుచేత పెద్ద దొంగ ఒక గాడిదను తోలుకుంటూ సత్రానికి వచ్చి, బ్రాహ్మణుడికి వినయంగా నమస్కారం చేసి, "అయ్యా, నా వల్ల ఏమరికేమన్నా పని ఉంటుందా?" అని అడిగాడు.

"లేదు, నా మనుషులు ఇద్దరు మూటలు పట్టుకుని వెళ్ళారు. ఇవాళో, రేపో ఒకడు తిరిగి వచ్చి, ఈ మూటను నా వెంట వచ్చి మా యింటికి చేరవేస్తాడు," అన్నాడు బ్రాహ్మణుడు.

పెద్ద దొంగ బ్రాహ్మణుణ్ణి కబుర్లలో పెట్టి, తిరిగి రాబోయే నౌకరు గురించి చాలా విషయాలు రాబట్టాడు. తరవాత

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు




వాడు చిన్న దొంగను పంపి, ఆ నౌకరుతో బ్రాహ్మణుడు అప్పుడే ఇంటికి తిరిగి రావటం లేదనీ, వాణ్ణి వెళ్ళి పొమ్మన్నాడనీ చెప్పించి తిప్పి పంపేయించాడు.

బ్రాహ్మణుడు తన నౌకరు కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. వెళ్ళిన నాలుగోరోజు కూడా వాడు తిరిగి రాక పోయేసరికి అయనకు ఓర్పు నశించింది. తన ఇంట దేవీపూజ దగ్గిర పడుతున్నది. ఈ లోపుగా తను ఇల్లు చేరాలి.

బ్రాహ్మణుడు ఈ స్థితిలో ఉండగా పెద్ద దొంగ ఆయన వద్దకు వచ్చి, "అయ్యా, నాకేమైనా పని ఇయ్యగలరా?" అని అడిగాడు.

"నీ గాడిద మీద నా మూటను మా యింటికి చేర్చగలవా?" అని బ్రాహ్మణుడు వాణ్ణి అడిగాడు.

ఏమిస్తారన్నాడు పెద్ద దొంగ. అయిదు రూపాయలిస్తానన్నాడు బ్రాహ్మణుడు. దొంగ సరే నన్నాడు.

మూట గాడిద మీది కెత్తి బ్రాహ్మణుడు దొంగ వెంట బయలుదేరాడు. వాళ్ళు ఒక మైలు వెళ్ళేసరికి, చిన్న దొంగ పోలీసువాడి దుస్తులు ధరించి వచ్చి, వాళ్ళను అగమని, "ఇది దొంగిలించిన గాడిద. చాకలి రఘూ గాడిదను వారం రోజుల క్రితం ఎవరో కాజేశారు," అన్నాడు.

"లేదు. ఇది నా గాడిదే. కిందటేడు ముప్పై రూపాయలు పోసి కొన్నాను," అన్నాడు పెద్ద దొంగ.

"దీని ఎడమ చెవికి గాయం మచ్చ ఉన్నది. ఇది రఘు గాడిదే. దానిముందు పన్ను ఒకటి విరిగి ఉంటుంది. దీని పన్ను చూడనీ!" అన్నాడు చిన్న దొంగ.

ఈ గాడిద పన్నుకూడా విరిగే ఉండటం చూసి బ్రాహ్మణుడు ఆశ్చర్యపోయాడు.

"ఎన్నో గాడిద చెవులకు మచ్చ లుంటాయి. పళ్ళు విరుగుతాయి." అన్నాడు పెద్ద దొంగ.

" దీని జీను అడుగుభాగం నీలంగా ఉండి, దానిమీద రఘు పేరు ఉంటుంది. చూడనీ," అన్నాడు పోలీసులాగా నటిస్తున్న చిన్న దొంగ.

అది కూడా రుజువయింది. పెద్ద దొంగ పారిపోతున్నట్టు నటించేసరికి చిన్న దొంగ వాణ్ణి పట్టుకున్నాడు. వాడు బ్రాహ్మణుడితో, " అయ్యా, మీరు కూడా న్యాయస్థానానికి హాజరు కావలిసి ఉంటుంది." అన్నాడు.

" నన్ను కూడా ఎందుకు ఇందులో ఇరికిస్తావయ్యా? నాకు ఈ దొంగతనం గురించి ఏమీ తెలీదు." అన్నాడు బ్రాహ్మణుడు.

"మీరు న్యాయాధికారి ముందు హాజరు అయి తీరాలి," అన్నాడు చిన్న దొంగ.

" బాబ్బాబు! నీకో నూరురూపాయ లిచ్చుకుంటాను. నన్ను పోనీ." అన్నాడు బ్రాహ్మణుడు.

" అలా అయితే, మీరు వెళ్ళవచ్చు." అన్నాడు చిన్న దొంగ.

" మరి నా మూట మాటేమిటి? దాన్ని నావెంట తీసుకుపోవాలి గద!" అన్నాడు బ్రాహ్మణుడు.

" గాడిదను వదలటానికి లేదు. మూట మీరు మోసుకు పోలేరా?" అని చిన్న దొంగ అడిగాడు.



మూట చాలా బరువు. దాన్ని తాను మోయలేనన్నాడు బ్రాహ్మణుడు.

" చీకటి కూడా పడబోతున్నది. ఈ రాత్రికి మీరూ, గాడిదా, ఈ దొంగా పోలీసు నిఘా కింద మా ఇంట్లో ఉండండి. రేపు మరొక గాడిదను కొనిపెడతాను. దాని మీద మూట పెట్టుకుని మీ ఊరు పోవచ్చు." అన్నాడు చిన్న దొంగ.

చేసేది లేక బ్రాహ్మణుడు సరే నన్నాడు. ఆ రాత్రి బ్రాహ్మణుడికి అన్ని సదుపాయాలూ జరిగాయి. మర్నాడు ఉదయం బ్రాహ్మణుడు కొత్త గాడిదకు యాభై రూపాయలు ధారపోసి, చిన్న దొంగకు నూరు రూపాయలూ ఇచ్చుకుని,



తన మూటను గాడిద మీద తన ఇంటికి చేర్చుకున్నాడు.

ఇంటికి వచ్చి ఆయన మూట విప్పి చూస్తే అందులో పాతగుడ్డలూ, రాళ్ళూ తప్ప ఏమీ లేవు. వెయ్యి రూపాయల ఖరీదు చేసే వస్తువులు పోయాయి. బ్రాహ్మణుడు జరిగిన మోసం గ్రహించి, వాకబు చెయ్యగా తనను దోచిన వాళ్ళు పేరు మోసిన దొంగలని తెలియవచ్చింది.

"కుక్క కాటుకు చెప్పు దెబ్బ! వీళ్ళకు మంచి గుణపాఠం నేర్పుతాను," అనుకున్నాడు బ్రాహ్మణుడు.

ఆయన ఇంట దేవీపూజ యథావిధిగా జరిగిపోయింది. ఎక్కడెక్కడి నుంచో వచ్చిన బంధువు లందరూ తిరిగి వెళ్ళారు. ఇక ఆయన తన పథకం నిర్ణయించటానికి పూనుకున్నాడు. ఆయన పొరుగున ఒక మిత్రుడున్నాడు. అతనికి ఇంద్రజాలం తెలుసును. అతను బ్రాహ్మణుడికి ఒక పథకం చెప్పాడు. అది అమలు చెయ్యటానికి అయన బ్రాహ్మణుడికి ఒక పరికరం కూడా ఇచ్చాడు. బ్రాహ్మణుడు తన జుట్టూ, గడ్డమూ, మీసాలూ పెంచుకుని, వంటవాడి వేషం ధరించి, ఇంద్రజాలికుడు ఇచ్చిన పరికరాన్ని ఒక గుడ్డసంచిలో పెట్టుకుని, మోసగాళ్ళకు బుద్ధి చెప్పటానికి బయలుదేరాడు.

ఆయన చిన్న దొంగ ఇంటికి వెళ్ళి, తియ్యగా కబుర్లు చెప్పి, తనకు అనేక కష్టాలు వచ్చినట్టు వర్ణించి చెప్పి, చిన్న దొంగను బాగా మభ్యపెట్టాడు. దొంగ లిద్దరూ కలిసే ఉంటున్నారు. వాళ్ళకు వంట చేసిపెట్టే వాళ్ళెవరూ లేకపోవటం చేత, బ్రాహ్మణుడికి తమ ఇంట ఆశ్రయం ఇచ్చి, వంట వాణ్ణిగా పెట్టుకోవటానికి ఒప్పుకున్నారు. ఈ కొత్త వేషంలో వాళ్ళు బ్రాహ్మణ్ణి గుర్తుపట్టనే లేదు. బ్రాహ్మణుడు వంటలు చెయ్యటంలో సిద్ధ హస్తుడు కావటం చేత, రకరకాల వంటకాలతో వారిని మెప్పించాడు.

ఒక రోజు రాత్రి తోడు దొంగలిద్దరూ ఇంటికి వచ్చేసరికి బ్రాహ్మణుడు వారి ముందు అపూర్వమైన తీపి సరుకు పెట్టాడు. వాళ్ళు తమ జన్మలో ఎన్నడూ అలాటి మిఠాయి సరుకు తిని ఉండ లేదు. ఆ బ్రాహ్మణుడు దాన్ని తన నైపుణ్యంతో సృష్టించాడు.

''ఇంత మంచి మిఠాయి ఎప్పుడూ చెయ్యలేదే? ఇవాళ ఎలా చేశావు?'' అని అడిగాడు పెద్ద మోసగాడు.

''కిందటి శనివారం మన ఇంటికి అతిథులు వచ్చినప్పుడు ఇది చెయ్యలేక పోయావా?'' అని చిన్న మోసగాడు అన్నాడు.

''ఇంత మంచి సరుకు చేసినందుకు, అడుగు, నువ్వు కోరినది ఇస్తాను,'' అన్నాడు పెద్దవాడు.

''అయ్యా, ఇందులో నా ప్రయోజకత్వం ఏమీ లేదు. అంతా ఆ యోగీశ్వరుడి మహిమ. ఇవాళ అపరాహ్ణం వారు మన ఇంటికి వచ్చారు. ఆయన శక్తులు ఏమని చెప్పను! నా పైన అనుగ్రహం కలిగి వారు నా కొక విచిత్రమైన గొట్టం ప్రసా దించారు. ఆ గొట్టం మహిమ ఏమిటో గాని, అది గోధుమ పొట్టును ఈ మిఠా యిగా మార్చింది!'' అంటూ బ్రాహ్మ ణుడు కళ్ళు మూసుకుని, యోగీశ్వరుడు




తన ఎదట ఉన్నట్టుగానే తలవంచి నమస్కారం చేశాడు.

"అబద్ధం!" అన్నాడు పెద్దమోసగాడు.

''మీ నమ్మకంతో నాకేం పని? దయ చేసి వచ్చే సోమవారం లోపల నన్ను పంపెయ్యండి. ఈ మిఠాయి సరుకు తయారు చేసి అమ్ముకుంటూ నేను సుఖంగా వ్యాపారం చేసుకుంటాను. పొట్టు కారుచౌక. యోగీశ్వరుడుగారు ప్రసాదించిన గొట్టంతో దాన్ని మిఠాయిగా మార్చి అమ్ముకుంటాను. కాకపోతే, ఒక్కటే చిక్కు. అది ఒక్క గంట సేపే, అది కూడా సోమవారం నాడు మాత్రమే, పనిచేస్తుంది. అయితే నేం?



ఒక గంటలో నేను వెయ్యి మిఠాయి దినుసులు తయారు చేసి, ఒక్కొక్కటీ ఇరవై పైసలకు అమ్మితే, రెండు వందల రూపాయలు వస్తాయి. వారానికి రెండు వందల రూపాయలు నెలకు ఎనిమిది వందలు — కొల్ల! ఏమంటారు?'' అన్నాడు బ్రాహ్మణుడు.

''గోధుమ పొట్టును మిఠాయిగా మార్చగలనని రుజువు చెయ్యగలవా?'' అని మోసగాళ్ళు అడిగారు.

''ఎందుకు చూపించ లేనండీ? మీరు కాస్త ఓపికపట్టి సోమవారం రానియ్యండి, చూపుతాను.'' అన్నాడు బ్రాహ్మణుడు.

వారం ఎలాగో గడిచింది. ఆదివారం రాత్రి బ్రాహ్మణుడు తన మిత్రు డిచ్చిన గొట్టం పైకి తీశాడు. నిజానికి అవి రెండు అట్టతో చేసిన గొట్టాలు. వాటితో పాటు ఉపయోగించటానికి ఒక గాజు గ్లాసు కూడా ఉన్నది. ఒక గొట్టం ఆ గ్లాసు కన్న ఒక్క రవ్వ పెద్దది. అంటే గాజు గ్లాసు పైన గొట్టాన్ని పూర్తిగా మూయ వచ్చు నన్నమాట. ఈ గొట్టం ఒక చివర శాశ్వతంగా అట్టతో మూసి ఉన్నది. అయితే ఆ మూత మధ్య చూపుడు వేలు పట్టే పాటి రంధ్రం ఉన్నది. ఇక రెండో అట్ట గొట్టం ఆకారంలోనూ, పరిమాణం లోనూ గ్లాసు కన్న ఒక్క పిసరు చిన్నదిగా ఉండి, గ్లాసు లోపల ఇమిడే లాగున్నది. దీని పైభాగాన కూడా శాశ్వతంగా అట్ట మూత ఉండి, దాని మధ్య కూడా వేలు పట్టే రంధ్రం ఉన్నది. ఈ రెండో గొట్టం పైభాగమంతటా గోధుమ పొట్టు బంకతో అంటించి ఉన్నది. దాని మూత మీద కూడా గోధుమపొట్టు అంటించి ఉన్నది. అందుచేత, ఈ రెండో గొట్టాన్ని గాజుగ్లాసులో పెడితే, ఆ గ్లాసు నిండా గోధుమ పొట్టు నించినట్టు కనిపిస్తుంది.

బ్రాహ్మణుడు తాను చేసిన మిఠాయి దినుసులను ఈ చిన్న గొట్టం నిండా పెట్టి,

దాని మీద గ్లాసు బోర్లించాడు. తరవాత గాజు గ్లాసును గొట్టంతో సహా సరిగా నిల బెట్టితే, గ్లాసునిండా గోధుమపొట్టు ఉన్నట్టె కనబడింది. ఇప్పుడు గ్లాసులోని గొట్టం మూత పైకి ఉన్నది. దాని పైన బ్రాహ్మ ణుడు కొద్దిగా గోధుమపొట్టు అదనంగా చల్లాడు. చూసేవాళ్ళకు గ్లాసులో గోధుమపొట్టె ఉన్నట్టు తేలికగా భ్రమ కలుగుతున్నది.

సోమవారం తెల్లవారుతూనే బ్రాహ్మ ణుడు శుచిగా స్నానం చేసి, గాజు గ్లాసును తీసుకుపోయి దొంగలకు చూపి, ఎత్తయిన బల్ల మీద ఉంచాడు. అతను కొద్దిగా ఊదే సరికి, గ్లాసు పైభాగాన చల్లిన గోధుమపొట్టు కొద్దిగా ఎగిరింది. తరవాత ఆయన పెద్ద గొట్టం పైకితీసి, అందులో ఏమీ లేదని దొంగలకు చూపి, దాన్ని గాజుగ్లాసు మీద బోర్లించాడు. తరవాత ఆయన ఆ గొట్టానికి నమ స్కారం చేసి, ఒక్క నిమిషం పాటు ధ్యానించి, మెల్లిగా గొట్టాన్ని పైకి తీశాడు.

గ్లాసులో గోధుమపొట్టుకు మారుగా మిఠాయి దిసుసులు ఉండటం చూసి దొంగలు దిగ్భ్రమ చెందారు. గోధుమ పొట్టు యావత్తూ మిఠాయిగా మారి పోయింది! వాళ్ళు దాన్ని రుచి చూస్తూ ఉంటే, బ్రాహ్మణుడు తన గొట్టాన్ని



సంచీలో పెట్టేసుకున్నాడు. బ్రాహ్మణుడు చేసిన యుక్తి ఏమిటంటే, ఆయన గొట్టాన్ని పైకి తీసేటప్పుడు రెండు గొట్టాలపై మూతలలోనూ ఉండే రంధ్రాల లోకి వేలు దూర్చి, రెంటినీ కలిపి లాగే శాడు. చిన్న గొట్టం, పెద్ద గొట్టంలో ఉండటం చేత చూసే వారికి పెద్ద గొట్టం మాత్రమే కనబడుతుంది. బ్రాహ్మణుడు గొట్టాలను ఎత్తినప్పుడు, చిన్న గొట్టంలో ఉంచిన మిఠాయి దిసుసులు గాజు గ్లాసులో మిగిలిపోయాయి.

దొంగలకు మిఠాయి అమృతం లాగున్నది. "మళ్ళీ మిఠాయి చెయ్యి," అన్నారు వాళ్ళు బ్రాహ్మణుడితో.

"నా దగ్గిర ఇక గోధుమపొట్టు లేదు," అన్నాడు బ్రాహ్మణుడు.

"వెధవ గోధుమపొట్టు కేం, మేం తెస్తాం," అన్నారు వాళ్ళు.

"మీరు తిరిగి వచ్చేసరికి గంట గడువు దాటి పోతుంది. గొట్టం పని చెయ్యదు," అన్నాడు బ్రాహ్మణుడు.

ఇద్దరు మోసగాళ్ళూ చాలాసేపు రహస్యంగా కూడబలుక్కుని, "నీ గొట్టం మాకు అమ్ము," అన్నారు.

"నేను దీన్ని ఏమైనా అమ్మను. ఇది నాకు వరప్రసాదం," అన్నాడు బ్రాహ్మణుడు.

వాళ్ళు వంద ఇస్తామన్నారు; అయిదు వందలు ఇస్తామన్నారు; వెయ్యి రూపాయలు ఇస్తామన్నారు. బ్రాహ్మణుడు ఆ గొట్టాన్ని అమ్మటానికి ఒప్పుకోలేదు.

"ఆఖరు మాట, రెండువేలిస్తాం. నువ్వు గొట్టం ఇవ్వకపోతే బలవంతాన లాక్కుంటాం. అమ్ముతావా, లేదా?" అని పెద్ద మోసగాడు అన్నాడు.

"సరే, రెండువేల అయిదువందలు ఇప్పించండి," అన్నాడు బ్రాహ్మణుడు.

ఆయన వారి వద్ద నగదుగా రెండు వేల అయిదువందల రూపాయలూ పుచ్చుకుని, తన చిన్న గొట్టం మాత్రం భద్రంగా తన సంచిలో దాచి, పెద్ద గొట్టాన్నీ, గాజు గ్లాసునూ వాళ్ళకిచ్చి, "తీసుకోండి. వచ్చే సోమవారం మీ చిత్తం వచ్చినంత మిఠాయి చేసుకోండి. గోధుమ పొట్టు పుష్కలంగా నిలవ ఉంచుకోండి, మరిచిపోయేరు," అన్నాడు.

ఆయన ఇంటికి పోతూ దారిలో తన తలా, గడ్డమూ, మీసాలూ పూర్తిగా క్షౌరం చేయించుకుని మామూలు అవతారంతో ఇల్లు చేరాడు.

మళ్ళీ సోమవారం వచ్చింది. దొంగలు గాజు గ్లాసు నిండా పొట్టు పోసి, గొట్టం మూసి తీశారు. ఎన్నిసార్లు చేసినా గ్లాసులో పొట్టు పొట్టుగానే ఉన్నది.

"వంటవాడు మనని మోసం చేశాడు!" అని మోసగాళ్ళు మొత్తుకున్నారు.





# తెలివైన కోరిక

పూర్వం సత్యకీర్తి అనే యువకుడు ఉండే వాడు. అతని తల్లి తండ్రులు చిన్న తనంలోనే పోతే, అవ్వ పెంచింది. ఆమె చచ్చిపోతూ రెండు బొమ్మలు ఇచ్చి, "నాయనా, ఈ ఇద్దరూ దేవతలు. వీళ్ళను శ్రద్ధగా పూజిస్తే నీకు శుభం కలగవచ్చు," అన్నది.

అవ్వ పోయినాక సత్యకీర్తి తిండికి కూడా లేక ఎక్కడైనా పోదామని బయలు దేరాడు. పోగా పోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక ఇల్లు కనిపించింది. వాడు ఆ ఇంట్లో ఉన్న ఆడ మనిషిని, "నాకు తిండికి ఇబ్బంది లేకుండా ఉండే చోటు కావాలి. అక్కడ కూర్చుని ఈ రెండు బొమ్మలనూ పూజ చేసుకుంటాను," అన్నాడు.

ఆ ఆడమనిషి నవ్వి, "ఇంకా ముందుకు పోతే ఒక మిట్ట వస్తుంది. అక్కడ చాలా పళ్ళచెట్లు ఉన్నాయి. ఒక పాడుపడిన ఇల్లు కూడా ఉన్నది. అక్కడ నీ బొమ్మలను పూజచేసుకుంటూ, పళ్ళు తిని బతకవచ్చు," అన్నది.

సత్యకీర్తి మిట్టను చేరుకున్నాడు. ఆ ఆడది చెప్పినట్టే అక్కడ ఒక పాడు పడిన ఇల్లూ, రకరకాల పళ్ళచెట్లూ ఉన్నాయి. వాడు ఆ కొంపలో ప్రవేశించి, చెట్ల పళ్ళు తింటూ అవ్వ ఇచ్చిన బొమ్మలను పూజించ సాగాడు.

కొన్నాళ్ళకు ఒక దేవత ప్రత్యక్షమై, "నీ పూజకు సంతోషించాను. నీకు ఏమి వరం కావాలో కోరుకో," అన్నది.

"అమ్మా, నువు ఏ దేవతవు?" అని సత్యకీర్తి అడిగాడు.

"నేను స్వార్థదేవతను. నువు నన్ను వరం కోరితే అందులో స్వార్థం ఉండాలి, మరిచిపోకు," అన్నది ఆ దేవత.

గార్లపాటి మల్లికార్జునరావు



"అమ్మా, నువు తలవని తలంపుగా కనిపించావు. అందుచేత నేను ఏం వరం కోరాలో ఆలోచించ లేదు. దయచేసి రేపు మళ్ళీ కనిపించి, నేను కోరే వరం ఇయ్యి." అన్నాడు సత్యకీర్తి.

స్వార్థదేవత అంతర్థాన మయింది.

స్వార్థం అంటే ఏమిటో సత్యకీర్తికి అర్థం కాలేదు. వాడు వెంటనే అడవిలో ఉంటున్న స్త్రీ వద్దకు వెళ్ళి, స్వార్థదేవత ప్రత్యక్షం కావటం చెప్పి, "స్వార్థ మంటే ఏమిటి?" అని అడిగాడు.

"తరవాత చెబుతాను గాని ముందు లోపలికిరా," అంటూ ఆమె సత్యకీర్తికి భోజనం పెట్టి, ఒక అమ్మాయిని తీసుకొచ్చి వాడి ఎదుట నిలబెట్టి, "ఈ పిల్ల ఎలా ఉన్నది?" అని అడిగింది.

"అద్భుతం!" అన్నాడు సత్యకీర్తి. వాడు అంత అందమైన స్త్రీని ఎన్నడూ చూడలేదు.

"నాయనా, ఇది నా కూతురు. పుట్టిన నాటినుంచీ మాట్లాడి ఎరగదు. దీని మూగతనం పోగొట్టేటట్టు స్వార్థదేవతను వరం కోరావంటే, దీన్ని నీ కిచ్చి పెళ్ళి చేస్తాను." అన్న దామె.

సత్యకీర్తి తన చోటికి తిరిగి వచ్చి, మర్నాడు స్వార్థదేవత కనిపించినప్పుడు, "నేను ఒక అమ్మాయిని పెళ్ళాడ దలిచాను. ఆమెకు మాటలు రావాలి." అని వరం కోరాడు. స్వార్థదేవత అందుకు అంగీకరించి మాయమయింది.

సత్యకీర్తి అడవిలో ఉన్న ఇంటికి వెళ్ళేసరికి ఆ స్త్రీ కూతురికి మూగతనం పోయింది. "నీ కూతురిని నా కిచ్చి చేస్తా నన్నావు కదా, చెయ్యి." అన్నాడు వాడు.

"సత్య కీర్తీ, నువు ఎంత అమాయకుడివి! ఇంత అందగత్తెను నీకిచ్చి ఎలా వివాహం చేసేది? ఇప్పుడు మూగది కాదు గనక, దీన్ని ఏ మహారాజైనా కళ్ళ కద్దుకుని చేసుకుంటాడు." అన్నదా స్త్రీ.

"ఇది న్యాయమా?" అన్నాడు సత్యకీర్తి.

"న్యాయమే! స్వార్థం అంటే ఏమిటని నిన్న అడిగావు చూడూ. నా కూతురిని నీ కియ్యకుండా ఏ మహారాజుకో ఇయ్యటమే స్వార్థం." అన్నాదా స్త్రీ.

సత్యకీర్తికి స్వార్థం ఏమీ రుచించ లేదు. అతను తన చోటికి తిరిగివచ్చి రెండో దేవతను పూజించ సాగాడు. కాని ఆ దేవత ఎన్ని ఏళ్ళకూ ప్రత్యక్షం కాలేదు. అతనికి గడ్డాలూ, మీసాలూ పెరిగిపోయాయి. వార్ధక్యం కూడా రానున్నది. ఆ సమయంలో రెండో దేవత ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నది.




సత్యకీర్తి ఆమెకు నమస్కరించి, "నువు ఎవరు, తల్లీ?" అని అడిగాడు.

"నన్ను నిస్వార్థదేవత అంటారు. నువు కోరే కోరికలో నీ స్వార్థం ఏమీ లేకుండా చూడు." అన్నది దేవత.

సత్యకీర్తి ఆమెను మర్నాడు కనపడ మని చెప్పి, అడవిలో ఉండే స్త్రీ వద్దకు వెళ్ళాడు. ఇప్పుడామె పండుముసలిది. ఆమె అతనికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టి, విశేషాలు అడిగింది. అతను ఆమెకు రెండో దేవత ప్రత్యక్షమయిందని చెప్పి, "నిస్వార్థ మంటే ఏమిటి?" అని అడిగాడు.

ముసలిది నవ్వుకుని, "నా కూతురిని కళింగదేశపు రాజు పెళ్ళాడాడు. వాళ్లకు వత్సల అనే కుమార్తె కలిగింది. దానికి ఇప్పుడు పద్దెనిమి దేళ్ళు. చక్కని చుక్క. అయితే దానికి మాటలు రావు. నిస్వార్థదేవతను అడిగి ఆ పిల్లకు మాటలు వచ్చేటట్టు వరం కోరు. ఆమెను నీకిచ్చి పెళ్ళి చెయ్యను. అలా చేస్తే అది నిస్వార్థం కాదు," అన్నది.

సత్యకీర్తి ఆమె వద్ద సెలవు పుచ్చుకుని తన గతిని గురించి విచారిస్తూ, దారి తప్పి కొంతసేపటికి ఒక ముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ ముని అతని విషయ మంతా విని, "బాబూ, నీ కన్న ఇరవై ఏళ్ళు ముందు నుంచీ ఇక్కడ తపస్సు చేస్తున్నాను. కాని నా తపస్సు ఫలించ

లేదు. అందుకు కారణం ఏమై ఉంటుందో నీ నిస్వార్థదేవతను అడిగి తెలుసుకుని, నాకు చెప్పగలవా ? '' అన్నాడు.

సత్యకీర్తి సరేనని, తన చోటికి దారి అడిగి తెలుసుకుని తిరిగివచ్చాడు.

మర్నాడు నిస్వార్థ దేవత తిరిగి ప్రత్యక్షమయింది. సత్యకీర్తి ఆమెను మూగదైన వత్సలకు మాటలు వచ్చేటట్టు చెయ్యమని కోరి, ముని తపస్సు ఫలించక పోవటానికి కారణం ఏమిటని అడిగాడు.

నిస్వార్థ దేవత వత్సలకు మాటలు ఎలా వచ్చేదీ చెప్పి, '' ఆ ముని చేసిన తపస్సంతా అతని కమండలం మింగేస్తున్నది. ఆ కమండలంలో చేరిన తపశ్శక్తి ఆయనకు తప్ప మరెవరికైనా లభిస్తుంది. దాన్ని ఎవరికైనా ఇచ్చిన తరవాత గాని ఆ ముని తపస్సు ఫలించదు,'' అని అదృశ్యమయింది.

సత్యకీర్తి ముని వద్దకు వెళ్ళి, దేవత చెప్పిన మాట చెప్పాడు. ఆ ముని తన కమండలాన్ని అతనికే ఇచ్చాడు. దాన్ని చేత పట్టుకోగానే అందులో ఉండిన తపశ్శక్తి వల్ల సత్యకీర్తి యువకుడుగా మారాడు. అతను తిన్నగా ముసలిది ఉన్న ఇంటికి వెళ్ళి, '' అవ్వా, నీ మనమరాలు తనకు భర్త కాబోయే వాణ్ణి చూడగానే మాట్లాడేస్తుందని దేవత చెప్పింది,'' అన్నాడు.

'' నువా, నాయనా ? నిన్ను పోల్చుకో లేదు. నా మనమరాలు ఇంతకు ముందే వచ్చింది. చూపిస్తానుండు,'' అన్నది.

అంతలోనే ఆమె మనమరాలైన రాజకుమార్తె బయటికి వచ్చి, సత్యకీర్తిని చూస్తూనే, '' అమ్మమ్మా, ఈయ నెవరు?'' అన్నది.

ఆ పిల్ల నోటమాట రావటం చూసి ముసలిది నిర్ఘాంతపోయి, '' నీకు మాట వచ్చిందా, తల్లీ ? ఇంతకూ నీ కాబోయే భర్త ఇతనేనా ఏం ? '' అన్నది.

కాలక్రమాన సత్యకీర్తి కళింగరాజుకు అల్లుడై, అనంతరం రాజు కూడా అయాడు.





# మోసానికి మోసం

ఒక ఊళ్ళో మాధవశర్మ అనే ధనికుడు ఉండేవాడు. ఆయన వట్టి అమాయకుడు. కాని అతని భార్య పార్వతమ్మ చాలా తెలివి గలది. భర్తకు అన్ని విషయాలలోనూ ఆమె సలహా లిచ్చేది.

అదే ఊళ్ళో రంగయ్య అనే పెద్ద మనిషి ఉన్నాడు. అతను పచ్చి మోసకారి. అతని ఇల్లు మాధవశర్మ ఇంటికి ఎదురుగానే ఉండేది. ఒకప్పుడు మాధవశర్మ తండ్రీ, రంగయ్య తండ్రీ మంచి స్నేహితులు. వారిద్దరూ కలిసి కొంత కాలం వ్యాపారం కూడా చేశారు. కాని. వాళ్ళ అనంతరం రెండు కుటుంబాల మధ్యా సంబంధాలు లేవు. దానికి కారణం రంగయ్య. మాధవశర్మ ఆస్తి కాజెయ్యాలని రంగయ్య చాలా ఎత్తులు వేశాడు. కాని పార్వతమ్మ తెలివి ముందు రంగయ్య ఎత్తులు పారలేదు.

ఇలా ఉండగా, ఒకనాడు రంగయ్య తన ఇంట్లో పాతసామానుల గది సర్దుతూండగా, ఒక కాగితం దొరికింది. రంగయ్య తండ్రి వద్ద మాధవశర్మ తండ్రి నాలుగువేలు అప్పు తీసుకుని ఏ నాడో ఒక పత్రం రాసి ఇచ్చాడు. ఆ బాకీ ఏ నాడో తీరిపోయింది. కాని తాను రాసి ఇచ్చిన పత్రాన్ని తిరిగి తీసుకోవటంలో మాధవశర్మ తండ్రి అశ్రద్ధ చేశాడు. ఆయనకు రంగయ్య తండ్రి మీద పూర్తి నమ్మకం. అదీగాక, ఆ బాకీ తీరినట్టు రంగయ్య తండ్రి అప్పుడే తన పద్దు పుస్తకంలో రాసేశాడు.

ఇప్పుడు ఆ పత్రం రంగయ్య కంట పడింది. దాన్ని చూడగానే రంగయ్యకు ఒక దురాలోచన కలిగింది. ఆ బాకీ తీరిపోయినట్టు మాధవశర్మ దగ్గిర సాక్ష్యం ఏమీ ఉండదు. ఈ పత్రం సహాయంతో

ముప్పిడి రవీంద్రారెడ్డి



గమనిస్తున్న పార్వతమ్మ అతని దొంగ ఎత్తు గ్రహించింది. ఆమెకు చాలా కోపం వచ్చింది. కాని దాన్ని నిగ్రహించుకుని, "రంగయ్యా, నువు ఈ పత్రం చూపించే వరకూ మాకు ఈ బాకీ సంగతే తెలియదు. ఆ బాకీ మేం తీర్చకపోతే ఎవరు తీరుస్తారు? కాని దీని విషయం న్యాయాధికారిని సలహా అడిగి, ఆయన చెప్పిన ప్రకారం తీరుస్తాం," అన్నది.

పార్వతమ్మ ఇలా అనే సరికి రంగయ్యకు రొట్టె విరిగి నేతిలో పడ్డట్టయింది. ఈ విషయం ఇంత తేలికగా తేలుతుందని అతను అనుకోలేదు. న్యాయాధికారి బాకీ పత్రాన్ని కాదని ఎలా అంటాడు? ఈ సారి పార్వతమ్మ తన ఎత్తుకు అడ్డుపుల్ల వెయ్యలేక పోయిందనుకుని, ఆమె చెప్పిన దానికి తల ఊపి, రంగయ్య ఇంటికి వెళ్ళాడు.

ఆ సాయంకాలం పార్వతమ్మ తన స్నేహితురాలైన న్యాయాధికారి భార్యను చూడబోయి, తమకు వచ్చిన సమస్య గురించి చెప్పింది. తరవాత ఆమె దానికి ఏంచేస్తే బాగుంటుందో కూడా న్యాయాధికారి భార్యకు తానే చెప్పి, ఇంటికి వచ్చేసింది.

న్యాయాధికారికి అతని భార్య పార్వతమ్మ చెప్పినదంతా చెప్పి, సహాయం

అతని వద్ద మళ్ళీ నాలుగు వేలు రాబట్టవచ్చు! అతను ఇవ్వనని పేచీ పెడితే న్యాయాధికారి వద్దకు పోవచ్చు.

ఈ ఆలోచనతో రంగయ్య ఆ పత్రం తీసుకుని మాధవశర్మ ఇంటికి వెళ్ళాడు. కొంత సేపు అతనితో ఏ వేవో కబుర్లు చెప్పి, మెల్లిగా బాకీ సంగతి ఎత్తాడు. ఏ నాడో లెక్కలన్నీ అయిపోతే మళ్ళీ ఇప్పుడు బాకీ ఏమిటని మాధవశర్మ అన్నాడు. రంగయ్య పత్రం బయట పెట్టాడు. దాన్ని చూసి మాధవశర్మ తెల్లబోయి, తన భార్యను పిలిచాడు.

రంగయ్య తమ ఇంటికి రావటం చూసిన క్షణం నుంచీ అతన్ని శ్రద్ధగా

చెయ్యమన్నది. పార్వతమ్మ ఇంటికి తిరిగివచ్చి తన భర్తతో, మర్నాడు న్యాయాధికారి దగ్గిర ఆయన ఏమేం చెయ్యాలో వివరంగా చెప్పింది.

మర్నాడు రంగయ్య పార్వతమ్మ చెప్పినట్టు గానే న్యాయాధికారి వద్దకు పోయి, తన తండ్రికి మాధవశర్మ తండ్రి రాసి ఇచ్చిన బాకీ పత్రం చూపించి, తన బాకీ తనకు ఇప్పించవలసిందిగా కోరాడు.

న్యాయాధికారి మాధవశర్మను పిలిపించి, అతనికి పత్రం చూపించి, ఆ బాకీ మాట ఏమిటని అడిగాడు.

అందుకు మాధవశర్మ ఇలా చెప్పాడు: ''మా తండ్రి రంగయ్య తండ్రి వద్ద అప్పు తీసుకున్న మాట నిజమే గాని, ఆయన తీసుకున్నది నాలుగు వేలు కాదు, ఆరు వేలు. అందుకు దాఖలాగా మా తండ్రి రాసిన పత్రం మా ఇంట్లో దొరికింది. ఆ పత్రాన్నిబట్టి నేను రంగయ్యకు ఆరువేలు ఇవ్వవలసి ఉంటుంది.''

ఇలా అని మాధవశర్మ ఒక బాకీ పత్రాన్ని న్యాయాధికారికి ఇచ్చాడు.

న్యాయాధికారి ఆ పత్రాన్ని బాగా పరిశీలించి, ''రంగయ్యా, నువు ఇచ్చిన పత్రం ప్రకారం బాకీ నాలుగు వేలు. ఈ పత్రం ప్రకారం బాకీ ఆరు వేలు. ఈ రెండింటిలో అసలు పత్రం ఏదో



నువు చెప్పితే, ఆ ప్రకారం నీకు డబ్బు ఇప్పిస్తాను,'' అన్నాడు.

కొత్త సమస్య వచ్చింది. రంగయ్యకు ఏం చెప్పాలో వెంటనే తోచలేదు. ఆరు వేల బాకీ పత్రమే నిజమయిందనటం తనకు లాభం. తాను చూసిన పత్రంలో బాకీ అదివరకే తీరిపోయినట్టు దాఖలా చూపిస్తే, ఈ కొత్త పత్రం కింద తనకు ఆరువేలు వస్తాయి.

ఈ దురాశతో రంగయ్య, ''నే నిచ్చిన పత్రంలో ఉన్న బాకీ, మాధవశర్మ చెప్పినట్టుగా, నిజమయింది కాదేమోనని నాకు కూడా ఇప్పుడు అనుమానం కలుగుతున్నది. ఒకవేళ ఈ బాకీ అదివరకే

తీరిపోయిందేమో, మా తండ్రి లెక్కల పద్దులో చూస్తాను,'' అని న్యాయాధి కారికి చెప్పి, ఇంటి నుంచి లెక్కల పద్దు తెచ్చి, అందులో నాలుగు వేల రూపాయల బాకీ తీరినట్టు ఉండటం ఆయనకు చూపాడు.

న్యాయాధికారి అక్కడ ఉన్న వారితో, "రంగయ్య తెచ్చిన పత్రంలో ఉన్న బాకీ అదివరకే తీరినట్టు రంగయ్య తెచ్చిన పద్దులో స్పష్టంగా ఉన్నది గనక ఆ పత్రం రద్దయిపోయింది,'' అన్నాడు.

అందరూ ఔనని తలలు ఊపారు.

తరవాత న్యాయాధికారి, "ఇప్పుడు మాధవశర్మ తెచ్చిన బాకీ పత్రం ఒక్కటే మిగిలి ఉన్నది. దాని ప్రకారం మాధవ శర్మ రంగయ్యకు ఆరువేలు ఇయ్యవలసి ఉంటుంది,'' అన్నాడు.

రంగయ్య సంతోషంగా తల ఆడించాడు.

"కాని మాధవశర్మ తెచ్చిన పత్రం సరి అయినది కాదు. అందులో ఉన్న దస్తూరీ, సంతకమూ మాధవశర్మ తండ్రివి కావు. ఆ సంగతి రెండు పత్రాలూ పోల్చి చూస్తే స్పష్టమవుతున్నది. అందుచేత ఈ బాకీ పత్రం కూడా చెల్లదు. ఈ పత్రం కింద మాధవశర్మ రంగయ్యకు ఏమీ ఇయ్యనవసరం లేదు,'' అన్నాడు న్యాయాధికారి.

రంగయ్య తెల్లబోయాడు. న్యాయాధి కారి అతనితో, "రంగయ్యా, నువు పెద్ద మనిషిగా చలామణీ అవుతూ, తీరిపోయిన బాకీ తీరలేదని అబద్ధాలాడి, అమాయకుడైన మాధవశర్మను మోసగించజూశావు. ఇలాటి వాడు ఈ ఊళ్ళో ఉండగూడదు. రేపటిలోగా నువు నీ కుటుంబంతో సహా ఈ ఊరు వదిలిపెట్టిపో,'' అని తీర్పు చెప్పాడు.

రంగయ్యకు తీరని అవమానం జరిగింది. పార్వతమ్మ తెలివితేటల ముందు తన ఎత్తు ఈ సారి కూడా పారకపోగా, ఆమె తన వేలుతోనే తన కన్ను పొడిచింది. అతను మర్నాడే సకుటుంబంగా ఆ పూరు వదిలి ఏటో వెళ్ళిపోయాడు.






తనకు రాజ్యం తిరిగి సంప్రాప్తం కావటానికి ముఖ్య కారకుడైన కృష్ణుడికి ధర్మరాజు తన కృతజ్ఞత తెలుపుకుని, అతన్ని స్తుతించాడు. తరవాత అయన తన తమ్ములతో, "నా మూలాన మీరు అరణ్యాలలో చెప్ప నలవిగాని కష్టాలు పడ్డారు. ఒక మాదిరివాళ్ళు అ కష్టాలకు తట్టుకుని ఉండరు. ఇప్పుడు మనం జయించాం. మీరు కొంతకాలం విశ్రాంతి తీసుకోండి. తరవాత మళ్ళీ కలుసుకుందాం," అన్నాడు.

అయన ధృతరాష్ట్రుడి అనుమతితో దుర్యోధనుడి భవనాన్ని దాసదాసీ జనంతో సహా భీముడికి నివాసంగా ఇచ్చాడు; అలాగే దుశ్శాసనుడి భవనాలు అర్జునుడికీ, దుర్మర్షణ దుర్ముఖుల ఎత్తయిన మేడలు నకుల సహదేవులకూ ఇచ్చాడు. వాళ్ళు తమ కొత్త ఇళ్ళలో ప్రవేశించారు. కృష్ణుడూ, సాత్యకీ అర్జునుడి ఇంటనే బసచేశారు.

కొద్ది రోజుల అనంతరం ధర్మరాజు కృష్ణుణ్ణి చూడబోయి, "మాకు రాజ్యమూ, ప్రతిష్ఠా లభించాయి గాని, మేం ధర్మహాని చేశామన్న అనుమానం ఇంకా బాధిస్తూనే ఉన్నది. ఈ అనుమానాన్ని దయచేసి రహితం చెయ్యి," అన్నాడు.

కృష్ణుడు కొంచెం సేపు ఆలోచించి, "నేను భీష్మణ్ణి గురించి ఆలోచిస్తున్నాను. అయనకు తెలియని ధర్మం లేదు. అంపశయ్య మీద పడుకుని ఉన్న



ఆ భీష్ముడు చచ్చిపోతే ఎంతో జ్ఞానం ఆయనతో నశించిపోతుంది. అందుచేత నువు త్వరగా ఆయన వద్దకు వెళ్ళి ధర్మ సందేహాలు అడిగి, ఆయన నుంచి అనేక విషయాలు నేర్చుకో,'' అన్నాడు.

దానికి ధర్మరాజు, ''ఆయనను గురించి నీ కున్న అభిప్రాయమే నాకూ ఉన్నది. నువే మమ్మల్ని ఆ మహానుభావుడి వద్దకు తీసుకుపో. నిన్ను చూడాలని ఆయన కూడా కోరుతూ ఉండవచ్చు.'' అన్నాడు.

కృష్ణుడు తన వెంట ఉన్న సాత్యకితో, ''మనం ఇప్పుడే భీష్ముణ్ణి చూడబోతున్నాం. రథం సిద్ధం చేయించు.'' అన్నాడు. తరవాత కృష్ణుడూ, సాత్యకి ఒక రథం మీదా, ధర్మరాజూ, అర్జునుడూ మరొక రథం మీదా, భీముడూ, నకుల సహదేవులూ ఇంకొక రథం మీదా ఎక్కి, భీష్ముడు పడి ఉన్న చోటికి వెళ్ళారు. కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ వేరు వేరు రథాల మీద వెళ్ళారు.

దారిలో వారికి అయిదు మడుగులు కనిపించాయి. అవి పరశురాముడివి అని కృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు. ఇరవై ఒక్క సార్లు పరశురాముడు క్షత్రియులను వెతికి వెతికి చంపి, ఈ మడుగులు వారి రక్తంతో నిండితే, పరశురాముడు ఆ రక్తంతో పితృతర్పణాలు చేశాడట.

ధర్మరాజు కోరిన మీదట కృష్ణుడు పరశురాముడి కథ ఇలా చెప్పాడు:

జహ్నుడు అనే రాజర్షి వంశంలో పుట్టిన గాధి అనే వాడికి సత్యవతి అనే కూతురు కలిగింది, కాని కొడుకులు లేరు. సత్యవతిని భృగుడి కొడుకైన ఋచీకుడికి ఇచ్చి పెళ్ళిచేశారు. ఋచీకుడు తనకూ, తన మామగారికీ కొడుకులు కలగాలనే ఉద్దేశంతో హవిస్సు తయారుచేసి, దాన్ని రెండు భాగాలు చేసి, సత్యవతితో. ''ఈ భాగం మీ అమ్మ

కిచ్చి, రెండో భాగం నువు తిను. అలా చేస్తే మీ అమ్మకు మంచి పరాక్రమవంతుడైన కొడుకు పుట్టి, క్షత్రియులనందరినీ చెండాడి, రాజు అవుతాడు. నీకు పరమ శాంతుడైన బ్రాహ్మణోత్తముడు పుట్టుతాడు,'' అని చెప్పాడు.

ఇది జరిగిన ఒకటి రెండు రోజులకే సత్యవతి తల్లి దండ్రులు ఋచీకుడి ఆశ్రమానికి, తీర్థ యాత్రలు చేస్తూ వచ్చారు. సత్యవతి తన తల్లితో తన భర్త చెప్పిన మాట చెప్పి, రెండు భాగాలుగా ఉన్న హవిస్సును ఆమె చేతికి ఇచ్చింది. సత్యవతి తల్లి తొందరపడి తన కూతురు తినవలసిన భాగాన్ని తాను తిని, తాను తినవలసిన భాగాన్ని తన కూతురికి పెట్టింది. ఆ సమయంలో అరణ్యానికి వెళ్ళి ఉండిన ఋచీకుడు ఇంటికి తిరిగివచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, ''మీ అమ్మ చేసిన పొరపాటు చేత నీ కడుపున మహా క్రూరుడైన క్షత్రియుడూ, మీ అమ్మ కడుపున బ్రాహ్మణుడూ పుడతారు,'' అన్నాడు.

సత్యవతి ఈ మాటకు ఎంతో విచారించి, ''నీ తపశ్శక్తి చేత నా కడుపున క్రూరుడు పుట్టకుండా చూడాలి. వాడి కొడుకు కావలిస్తే క్రూరుడు కానీ.'' అన్నది. అలాగే చేస్తానన్నాడు ఋచీ



కుడు. సత్యవతికి శాంతుడైన జమదగ్ని, గాధి భార్యకు విశ్వామిత్రుడూ కలిగారు. జమదగ్నికి పరశురాముడు పుట్టాడు. పరశురాముడు పెరిగి పెద్దవాడై, గంధమాదనంలో మహాదేవుణ్ణి ఆరాధించి, ఆ దేవుడి దయవల్ల అనేక అస్త్రాలూ, ఒక గండ్రగొడ్డలీ సంపాదించాడు.

ఇలా ఉండగా, హైహయ వంశానికి చెందిన కృతవీర్యుడి కొడుకు అర్జునుడు అనేవాడు దత్తాత్రేయుడి అనుగ్రహం వల్ల వెయ్యి చేతులు గలవాడై, రాజులందరినీ జయించి, అశ్వమేధ యాగం చేసి, బ్రాహ్మణులకు అంతులేని దానాలు చేస్తూ అగ్నిదేవుడికి పర్వతారణ్య



ప్రాంతాలు దానంచేశాడు. ఆ ప్రాంతాలను అగ్నిదేవుడు తగలబెట్టేటప్పుడు వసిష్ఠుడి ఆశ్రమం కూడా కాలిపోయింది. అందుకు వసిష్ఠుడు అలిగి, "నా ఆశ్రమాన్ని అగ్ని ఎలా ధ్వంసం చేశాడో, ని చేతులను పరశురాముడు అలా ధ్వంసం చేస్తాడు." అని శాపం పెట్టేశాడు. ఈ శాపానికి అర్జునుడు ఏమాత్రమూ జంకలేదు.

పరశురాముడికీ, కార్తవీర్యార్జునుడికి వైరం ఏర్పడటానికి కారకులు ఆ అర్జునుడి కొడుకులు. పొగరుబోతులైన వాళ్ళు పరశురాముడి ఆశ్రమానికి వెళ్ళి, పరశురాముడు లేని సమయంలో అతని హోమధేనువునూ, దాని దూడనూ బలాత్కారంగా తోలుకు పోయారు. అందువల్ల కలిగిన కోపంతో పరశురాముడు కార్తవీర్యార్జునుడి వెయ్యి చేతులూ నరికి, తన గోవునూ, దూడనూ తెచ్చుకున్నాడు.

హైహయులు ఆ పోట్లాటను అంతతో పోనివ్వక, పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో మరొకసారి వచ్చి, జమదగ్ని తల నరికారు. పరశురాముడు మండిపడి, భూమి మీద క్షత్రియుడన్నవాడు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసి, అర్జునుడి కొడుకులనూ, మనుమలనూ మాత్రమే కాక, భూమిపైన క్షత్రియుడు అనేవాడు ఎక్కడ ఉన్నా, వెళ్ళి చంపేశాడు.

అంతటితో శాంతుడై పరశురాముడు వనానికి వెళ్ళి తపస్సు చేసుకుంటూ ఉండగా, ఒకసారి విశ్వామిత్రుడి కొడుకు పరావసువు అనేవాడు ఆయన వద్దకు వెళ్ళి, "క్షత్రియులనందరినీ చంపుతానని ప్రతిజ్ఞ చేశావు గాని, నెరవేర్చుకోలేదు. ప్రతర్దనుడు మొదలైన వాళ్ళు జీవించే ఉన్నారు." అన్నాడు.

పరశురాముడు మళ్ళీ ఆయుధాలు ధరించి బయలుదేరి, వృద్ధులనీ, పిల్లలనీ, కడుపులో ఉన్న పిండాలనీ కూడా



కశ్యపుడు ఈ సంగతి తెలిసి, భూమిని పాలించటానికి క్షత్రియుల కోసం వెతికితే చాలామంది దొరికారు. కొందరు హైహయులను వారి తల్లులు రహస్యంగా కాపాడారు. పురువంశానికి చెందిన విదూరథుడనేవాడు ఋక్షపర్వతం మీద పెరిగాడు. సౌదాసుడు అనేవాణ్ణి పరాశరుడు కాపాడాడు. శిబి కొడుకును గోవులు రక్షించాయి. అతనికి గోపతి అన్న పేరు వచ్చింది. ప్రతర్దనుడి కొడుకు వత్సుడనేవాడు బతికాడు. గౌతముడు గుప్తుడు అనేవాణ్ణి కాపాడాడు. బృహద్రథుణ్ణి కోతులు కాపాడాయి. మరుత్తవంశ క్షత్రియ కుమారులను సముద్రం రక్షించింది. ఇలా బతికిన వారంతా శిల్పకారుల జాతులలోనూ, సువర్ణకారుల జాతులలోనూ జీవిస్తూవచ్చారు.

పాటించకుండా క్షత్రియులనందరినీ చంపాడు. ఇలా ఇరవైఒక్కసార్లు ప్రపంచంలో ఉన్న క్షత్రియులను హతమార్చి, పరశురాముడు అశ్వమేధయాగం చేసి, భూమినంతా కశ్యపుడికి దానం చేశాడు.

కశ్యపుడు భూమిని దానంగా పుచ్చుకుంటూ, "రామా, నీకు కూర్చునే మేర మాత్రం చోటు ఇస్తాను. అక్కడే కూర్చుని తపస్సు చేసుకో," అన్నాడు. ఆయన ఆ భూమి కంతటికీ బ్రాహ్మణులను రాజులుగా చేసి, తాను తపోవనానికి వెళ్ళాడు. బ్రాహ్మణుల పరిపాలనలో అరాజకం ప్రబలి, బలవంతులు బలహీనులను పీడించసాగారు.

కశ్యపుడు ఆ క్షత్రియుల నందరినీ పిలిపించి, వారికి భూమి ఇచ్చి పాలించుకోమనిచెప్పాడు. త్వరలోనే భూమి మీద ఎక్కడ చూసినా కొత్త రాజవంశాలు వెలిశాయి.

కృష్ణుడు ఇలా చెప్పిన పరశురాముడి కథ విని ధర్మరాజు భీష్ముణ్ణి చూడబోయాడు. అప్పటికి ఉత్తరాయణం ఇంకా యాభైఆరురోజులున్నది. భీష్ముడు ధర్మరాజును ఊరడిస్తూ, యుద్ధంలో

శత్రువులను చంపటం ధర్మవిరుద్ధం కాదనీ, అది క్షత్రియ ధర్మమనీ చెప్పాడు. ఆయన తాను ప్రాణాలతో ఉన్నంత కాలమూ ధర్మరాజుకు అనేక ధర్మాలూ, ధర్మ సూక్ష్మాలూ, నీతులూ చెప్పి, చివరకు ప్రాణాలు వదిలాడు. అప్పుడొక చిత్రం జరిగింది! భీష్ముడి శరీరంలో ఏయే అంగాల నుంచి ప్రాణం పోతున్నదో ఆ అంగాల నుంచి బాణాలు వాటంతట అవే రాలి పడిపోయాయి. చూస్తూండగానే ఆయన శరీరంలో బాణాలన్నీ ఊడిపోయాయి. ఇది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు.



దారుకర్రలూ, గంధద్రవ్యాలూ తెచ్చి పాండవులూ, విదురుడూ చితిపేర్చారు, భీష్ముడికి తెల్లబట్టలు కప్పి, పూలు చల్లారు. భీష్ముడి తెల్లగొడుగును యుయుత్సుడూ, ఆయన చామరాలను భీమార్జునులూ, ఆయన తలపాగాను నకుల సహదేవులూ పట్టుకున్నారు. ధర్మరాజూ, ధృతరాష్ట్రుడూ ఆయన పాదాలు పట్టుకున్నారు. భీష్ముడికి దహనసంస్కారం జరిగింది. అందరూ గంగాతీరం చేరారు. ధర్మరాజు జలతర్పణాలు విడిచాడు.

ఆయన కుప్పకూలిపోయి ఏడుస్తూంటే, కృష్ణుడి ప్రేరేపణతో భీముడు ఓదార్చాడు. అయితే అన్న దుఃఖం చూసి మిగిలిన పాండవులు కూడా ఏడ్చారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఊరడిస్తూ, "నూరుమంది కొడుకులనూ, సమస్తాన్నీ పోగొట్టుకున్నందుకు నేనూ, గాంధారీ ఏడవాలిగాని నీకు విచారం దేనికి? రాజ్యం గెలుచుకున్నావు. నీకు బాధ్యతలు చాలా ఉన్నాయి. ఏడుస్తూ కూచోకు," అన్నాడు.

వ్యాసుడు ధర్మరాజుతో అశ్వమేధ యాగం చెయ్యమన్నాడు.

దానికి ధర్మరాజు, "మహాత్మా, అశ్వమేధయాగం చేసి ఘనంగా దానాలు చెయ్యాలి. అల్పదానాలు నాకిష్టం లేదు.

గొప్ప దానాలు చెయ్యటానికి నా వద్ద ధనం లేదు. ప్రజలు చూడబోతే దీనులూ, పిల్లలూనూ. వారిని యాచించటం నాకు ఇష్టం లేదు. ఆత్మీయులను కోల్పోయి ఏడ్చేవాళ్ళ మీద పన్నులు ఏమని వెయ్యను ?" అన్నాడు.

ధర్మరాజుకు పుష్కలంగా ధనం దొరికేమార్గం వ్యాసుడు చెప్పాడు. పూర్వం మరుత్తమహారాజు యాగం చేసి బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చాడు. ఆ బ్రాహ్మణులు ఆ ధనమంతా హిమాలయం మీద వదిలేశారు. దాన్ని తెచ్చుకుంటే ధర్మరాజుకు చాలుతుందని వ్యాసుడు చెప్పాడు.

ధర్మరాజు మరుత్తుడి కథ వినగోరితే, వ్యాసుడు ఇలా చెప్పాడు :

త్రేతాయుగారంభంలో మనువు వంశాన కరంధముడు అనే రాజు బృహస్పతినే యాజకుడుగా పెట్టుకుని, నూరు అశ్వమేధాలు చేసి, ఇంద్రుడితో సమానుడనిపించుకున్నాడు.

అతని కొడుకు మరుత్తు తండ్రిని మించినవాడు. అతను యాగాలు చెయ్య సంకల్పించి, వేలకొద్దీ బంగారు పాత్రలు చేయించాడు. ఆ యజ్ఞంలో పాత్రలే కాక సమస్త ఉపకరణాలూ బంగారంతో చేసినవే. మరుత్తు అనేకమంది రాజులతో కలిసి, హిమాలయానికి ఉత్తరంగా, మేరుపర్వతానికి సమీపాన ఒక చిన్న కొండమీద యాగాలు చేశాడు.

ఈ యాగాలకు బృహస్పతి యాజకుడు కావలిసింది. కాని ఇంద్రుడు మరుత్తు పట్ల ఈర్ష్యగలవాడై బృహస్పతిని వారించాడు. అప్పుడు మరుత్తుడు బృహస్పతి తమ్ముడైన సంవర్తుణ్ణి యాజకుడుగా పెట్టుకున్నాడు. యజ్ఞం మహా వైభవంగా జరిగింది. తరవాత మరుత్తు బంగారం రాసులుగా పోసి, బ్రాహ్మణులకు దానాలు చేశాడు. అయినప్పటికీ ఇంకా ఎంతో మిగిలిపోయింది. ఆ బంగారాన్ని తెచ్చుకోమని వ్యాసుడు ధర్మరాజుకు చెప్పాడు.






## 10

యుక్తితో కుందేలు క్రూరమైన సింహాన్ని చంపిన కథ దమనకం చెప్పగా విని, కరటకం, "ఇలాటి యుక్తులు ఎల్లప్పుడూ పారుతాయని ఎలా చెప్ప గలవు ?" అని అడిగింది.

"మనం ప్రమాదాలకు సిద్ధపడాలి. లేకపోతే లాభం పొందలేం. ధైర్యవంతుడికి దేవతలు కూడా తోడ్పడతారు. సాలెవాడు సాహసంతో విష్ణువుపాత్ర ధరించబట్టేగదా మహా సౌందర్యవతి అయిన రాజకుమార్తెను పొందగలిగాడు ?" అన్నది దమనకం.

"అదెలాగ?" అని కరటకం అడిగింది. ఆ కథను దమనకం ఇలా చెప్పింది:

### సాలెవిష్ణువు కథ

వంగదేశంలోని పుండ్రవర్ధనం అనే నగరంలో ఆప్తమిత్రులైన ఒక సాలెవాడూ, వడ్రంగీ ఉండేవారు. వాళ్ళు తమ వృత్తులలో గొప్ప నిపుణులు కావటం చేత, అంతులేని సంపాదనలు కలిగి, అందమైన భవంతులలో నివసిస్తూ, డబ్బును మంచినీటి లాగా ఖర్చు చేసేవారు; సువాసనలు గల పూలు ధరించి, అత్తరువులు పూసుకుని, సుగంధ తాంబూలాలు సేవించేవారు.

ఒకసారి ఒక గొప్ప ఉత్సవం జరిగింది. వేడుకలు జరిగే ప్రతి స్థలానికీ జనం మంచి బట్టలు ధరించి తండోపతండాలుగా వస్తున్నారు.

సాలెవాడూ, వడ్రంగీ కూడా చక్కగా అలంకరించుకుని, బయలుదేరారు. అక్కడ వాళ్లు ఉత్సవం జరిగే ప్రతి చోటికీ తిరిగి ఆనందిస్తూ, ఇతరులు చేసుకున్న అలంకరణలను పరిశీలించసాగారు.

అట్ట చివరి బొమ్మ



అతను తన స్థితిని గురించి ఆలో చిస్తూ, ''అందం ఉన్న చోట మంచి తనం కూడా ఉంటుందంటారు గదా, ఈ అందగత్తె నన్ను ఎందుకిలా బాధి స్తున్నది? ఎవడైనా తన కొంపను తానే దహించుకుంటాడా? ఈ రాజకుమార్తె నా హృదయంలో తిష్ఠవేసుకుని, దాన్ని ఎందుకు దహిస్తున్నది? దేవుడు నా ప్రాణం తీయదలిస్తే అందుకు మరే దన్నా సాధనం చూడక ఈమెను ఎందుకు ఉపయోగించుతున్నాడు? ప్రపంచంలో ప్రతిదీ క్షణికమేనని బుద్ధుడు చెప్పిన మాట నిజం కాదు. నిజమైతే, రాజ కుమార్తె మీద నాకు కలిగిన మోహం పోదేం?'' అనుకున్నాడు.

ఒక మహాభవనం గవాక్షంలో రాజ కుమార్తె సుదర్శన చెలికత్తెలను వెంట ఉంచుకుని వారి కళ్ళపడింది. ఆమె నవయౌవనంలో ఉన్నది. ఆమె అపు రూప సౌందర్యవతి. ఆమెను చూస్తూనే సాలెవాడు తీవ్రమైన మోహానికి గురి అయినాడు. అతను తన వికారాన్ని ఎలాగో బయట పడకుండా దాచుకుని, ఇంటికి తిరిగి వచ్చాడు. కాని తన ఇంట్లో ఒంటరిగా ఉన్నప్పుడు ఎటు చూసినా అతనికి రాజకుమార్తె రూపమే కనబడ సాగింది. అతను ఎంతో విచారంగా మంచం మీద పడిపోయి, ఆమెనే ధ్యానిస్తూ పడుకున్నాడు.

ఇలా పిచ్చి పిచ్చి ఆలోచనలతో సాలె వాడు ఆ రాత్రి అంతా జాగరం చేశాడు. మర్నాడు మామూలు వేళకు వడ్రంగి అతన్ని చూడటానికి చక్కగా అలంక రించుకుని వచ్చి, తన మిత్రుడు శవం లాగా మంచం మీద పడి ఉండటం చూసి, ''మిత్రమా, నీకేమయింది?'' అని అడిగాడు.

సాలెవాడు నిట్టూర్పులు విడిచాడే గాని జవాబు చెప్పలేదు. వైద్యం కొంత తెలి సిన వడ్రంగి తన స్నేహితుడి నాడి పరీక్షించి, నుదురు తాకి చూసి,

"మిత్రమా, నీది ప్రేమజ్వరం లాగుంది. ఎవతెను ప్రేమించావు?" అని అడిగాడు.

సాలెవాడు ఆశ్చర్యంతో లేచి కూర్చుని, "బాధను ప్రేమించిన భార్యతోగాని, మిత్రుడితోగాని పంచుకుంటే తగ్గుతుం దంటారు," అంటూ తన బాధను బయట పెట్టాడు.

వడ్రంగి అంతా విని, "సుప్రతివర్మ మహారాజు క్షత్రియుడు. నువు వైశ్యుడివి. నీ కన్న గొప్ప కులానికి చెందిన స్త్రీని కోరటానికి నీకు జంకులేదా?" అని అడిగాడు.

"క్షత్రియుడు క్షత్రియ, వైశ్య, శూద్ర, కన్యలను వివాహం ఆడవచ్చు. ఈమె రాజుకు వైశ్య భార్య వల్ల పుట్టినదే అయి ఉంటుంది. లేకపోతే నాకు ఆమె పైన ప్రేమ కలిగి ఉండదు. ఇటువంటి వాటికి అంతరాత్మే సాక్షి!" అన్నాడు సాలెవాడు.

"ఇప్పుడు ఏం చెయ్యాలి?" అని వడ్రంగి అడిగాడు.

"నాకు చితి సిద్ధం చెయ్యి. నాకు రాజకుమార్తె లభించటం అసంభవం. ఆమె లభించకపోతే నేను బతకటం అసంభవం. అంతులేని శరీర బాధా, మనోవేదనా అనుభవించి నేను చావక తప్పదు," అన్నాడు సాలెవాడు.



"అదంతా కట్టిపెట్టు. ధనంతోగాని, బుద్ధితోగాని సాధించరానిది ప్రపంచంలో ఏదీ లేదు. నువు లేచి, స్నానం చేసి, భోజనం చేసి, మామూలుగా ఉండు. నీకు రాజకుమార్తె దక్కే వైనం నేను ఆలోచిస్తాను," అన్నాడు వడ్రంగి.

తన మిత్రుడి తెలివితేటలలో అపార మైన విశ్వాసం ఉండటం చేత సాలె వాడు విచారం కట్టిపెట్టి, మామూలు ప్రకారం జీవించసాగాడు.

కొద్ది రోజుల అనంతరం వడ్రంగి సాలెవాడి వద్దకు గరుడ రూపంలో గల విమానాన్ని తెచ్చాడు. అది చక్కగా రంగులు వేసి ఉన్నది. దాన్ని నడపటా

నికి ఒక కాడ ఉన్నది. అలాటి విమానాన్ని పూర్వం ఎన్నడూ ఎవరూ చూసి ఉండరు.

దాన్ని ఎలా నడపాలో సాలెవాడికి చెబుతూ, "పైకిలేచి ఎగురుతూ వెళ్ళాలంటే, ఈ కాడను బయటికి లాగు, కిందికి దిగి ఆగదలిస్తే కాడను లోపలికి నొక్కుయ్యి," అన్నాడు వడ్రంగి.

సాలెవాడు ఆ గరుడ విమానాన్ని నడపటం పూర్తిగా నేర్చుకున్నాడు.

"సుప్రతివర్మ మహారాజూ, ఆయన కుటుంబమూ, ముఖ్యంగా రాజకుమార్తె సుదర్శనా, నారాయణభక్తులు. వారి పూర్వీకుడు ఒకడికి నారాయణ ప్రత్యక్షమై, వరాలు ఇచ్చినట్టు కూడా చెప్పుకుంటారు. కనక నువు శంఖు, చక్ర, గదా, పద్మాలు ధరించి, ఈ గరుడ విమానం మీద వెళ్ళి, రాజభవనం పైభాగాన వాలు. అక్కడే రాజకుమార్తె శయన మందిరం ఉన్నదనీ, అందులో ఆమె ఒంటరిగా పడుకుంటుందనీ నేను వాకబుచేసి తెలుసుకున్నాను. నువు నారాయణ లాగా నటిస్తూ, గాంధర్వ విధిని ఆమెను నీ భార్యను చేసుకో," అన్నాడు వడ్రంగి.

ఆ పగలల్లా సాలెవాడు ఆనందంగా ఊహలలో విహరించి, రాత్రి పడగానే ఖరీదైన పట్టుబట్టలు కట్టుకుని, సుగంధ లేపనాలు ఒంటికి పూసుకుని, శంఖుచక్ర గదా పద్మాలు వెంటబెట్టుకుని గరుడ వాహనం ఎక్కి, తిన్నగా వెళ్ళి, రాజకుమార్తె శయనమందిరం ముందు డాబా మీద వాలాడు.

అది పండు వెన్నెల రాత్రి. రాజకుమార్తె పంచలో మంచం మీద పడుకుని, అకస్మాత్తుగా నారాయణను తనకు సమీపంలో గరుడవాహనం మీద చూసింది. సాలెవాడు చాలా అందగాడు. అతని రూపం నారాయణుడి వర్ణనకు తగినట్టే ఉన్నది. ఆమె చప్పున లేచి, సాలెవాడి ముందు సాష్టాంగపడి, "స్వామీ, నా పైన అనుగ్రహం కలిగి ఇలా రావటానికి కారణం ఏమిటి?" అని అడిగింది.



# 148. పురాతన ప్రదర్శనశాల

ఇస్ట్రియా (ప్రాచీన ఇటలీ) లోని రేవునగరమైన పోలా వద్ద రోమనులు నిర్మించిన ఈ ప్రదర్శనశాలలో 25000 మంది కూర్చునేటందుకు చోటు ఉండేది. ఈ నగరం 1148 లో వెనీషియనుల వశమయింది. వారు దీనిలోని ఆసనాల రాతిపలకలను ఇళ్ళు కట్టటానికి ఉపయోగించుకున్నారు. 1850 లో పోలానగరం ఆస్ట్రియనుల కిందికి వచ్చి, రోమనుల కాలంలో లాగా తిరిగి ప్రసిద్ధమైన రేవునగరం అయింది.



Photo by Sharma Studio-Bhilwara



బహుమతి
పొందిన వ్యాఖ్య

శ్రమ జీవనం

పంపినవారు :
జి. సత్యనారాయణమూర్తి

Photo by Pasala Krishna Kumar



చింతావారి వీధి,
అనకాపల్లి.

స హ జీ వ న ం

బహుమతి
పొందిన వ్యాఖ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఏప్రిల్ నెల 20వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూన్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
విశ్రాంతి

మూడవ అట్ట:
వినోదం

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3 Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

*Photo by:* **PRABHAKAR MAHADIK**



RECREATION

